# జాతీయ వయోజన విద్యాకార్యక్రమం





## జనవాచకం - 2

# ఆదాయం పెంచుకో





ప్రకాశకులు

వయోజన విద్యాశాఖ డైరెక్టరు కార్యాలయము

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

హైదరాబాదు - 1984

జనవాచకం - 2



# ఆదాయం పెంపుకో



కూర్పు

**వి. ఈశ్వరరెడ్డి**

(నాన్-ఫార్మల్ విద్యాశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం)

**భద్రిరాజు కృష్ణమూర్తి**

(భాషాశాస్త్రశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం)

ప్రకాశకులు

**డైరెక్టర్**
**వయోజన విద్యాశాఖ**

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

హైదరాబాదు

1984

*New Edition*
*First Published, 1979*
*Second Edition, 1981*
*Third Edition, 1984*





*Price :* **Rs. 1-20 Paise**

విషయ సేకరణలోనూ రచనలోనూ సహకరించినవారు :

**డాక్టర్ పి. సాందీప్**
**శ్రీ ఆర్. కృష్ణారావు**
**కుమారి బి. ఇ. హేమానళిని**
**డాక్టర్ పోరంకి దక్షిణామూర్తి**

ప్రకాశకులు

**డైరెక్టర్**
**వయోజన విద్యాశాఖ**

**ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం**
**హైదరాబాదు**

# ముందు మాట

జాతీయ వయోజన విద్యా కార్యక్రమము మన రాష్ట్రంలో 1979-80 సం॥ నుండి ప్రారంభించబడినది. ప్రభుత్వ యాజమాన్యం క్రింద ప్రతి వయోజన విద్యా ప్రాజెక్టులో 300 వయోజన విద్యా కేంద్రాలుంటాయి. ప్రతి కేంద్రములో 15-35 సం॥ల మధ్య వయస్సు గల 30 మంది నిరక్షరాస్యులకు వయోజన విద్య లభిస్తుంది.

ప్రతి ప్రాజెక్టులో స్థాపించిన 300 కేంద్రాలలో 30% షెడ్యూల్డుకులాల వారికి, 10% షెడ్యూల్డు తెగలవారికి ఏర్పాటు చేయబడినవి. స్త్రీలకు ప్రత్యేకించి వయోజన విద్యా కేంద్రములు గలవు. నూతన అక్షరాస్యులకై అక్షరాస్యతానంతర కార్యక్రమము (Post-Literacy Programme), నడుపబడుచున్నది. వారు పొందిన అక్షరాస్యతను, గ్రహించిన విషయాలను మరింతగ అభివృద్ధి పరచటం ఈ కార్యక్రమ లక్ష్యం.

ఇవిగాక స్వచ్ఛంద సేవా సంస్థలు, కళాశాలలోని జాతీయ సేవా పథకము (National Service Scheme), సమగ్ర శిశు సంక్షేమ పథకము మరియు నెహ్రూ యువక కేంద్రముల యాజమాన్యము కింద కూడ వయోజన విద్యా కేంద్రములు నడుపబడుచున్నవి.

వయోజనుల ఆదాయాన్ని మెరుగుపరచడం ఈ కార్యక్రమం యొక్క ఒక ముఖ్యమైన లక్ష్యం. ఇందుకు వారి వృత్తులకు సంబంధించిన విషయాలు దైనందిన జీవిత సమస్యలు వాటి పరిష్కారమార్గాలు తెలియజేయడం అవసరం. ఈ ఉద్దేశంతో ఈ పుస్తకాన్ని రూపొందించడం జరిగింది. వీటిని కొంతకాలం వయోజన విద్యా కేంద్రాలలో ఉపయోగించాక వచ్చిన అనుభవం దృష్ట్యా అవసరమైన మార్పులు తెచ్చి వీటిని మెరుగుపరచాలనేది మా సంకల్పం.

జి. మనోహర్ రావు.
సంచాలకులు, వయోజన విద్యాశాఖ,
ఆంధ్రప్రదేశ్.

హైదరాబాదు
17-1-84

# విషయసూచిక

# పరిచయం

| | | | |
|---|---|---|---|
| సమస్య | ముఖ్యమైన | బ్యాంకులు | నిరుత్సాహం |
| ఆరోగ్యం | ఏహ్యాభావం | తాత్సారం | సంప్రదించు |
| గవర్నమెంటు | సంస్థలు | ప్రోత్సాహం | నష్టం |
| తీర్మించు | ఎదుర్కొనాలి | కష్టం | కోళ్ళ పెంపకం |
| డాక్టర్లు | ఖర్చు | స్వల్పం | శాస్త్రకారులు |
| అభివృద్ధి | విస్తరణాధికారి | వ్యవసాయం | |
| ఇనస్పెక్టర్ | ఉద్యోగులు | | |

గ్రామ ప్రజలకు ఈనాడు ఎన్నో సమస్యలున్నాయి. వాటిలో ముఖ్యమైంది తగినంతగా ఆదాయం లేకపోవడం. చాలా సమస్యలకు ముఖ్యకారణం తగినంత ఆదాయం లేకపోవటమే. మనకొచ్చే కూలివల్ల, పండే పంటలవల్ల, ఇతర పనులవల్ల తగినంత ఆదాయం రావటంలేదు. దీనికి తోడు ధరలు పెరగటం, అప్పులు చేయటం, వడ్డీలు కట్టడం మరెన్నో బాధలుపడటం. ఈ సమస్యను మనం ఎదుర్కోవాలి. తరతరాలుగా వస్తున్న ఈ పేదతనానికి మనం అలవాటుపడి బతుకుతున్నాం. ఇది తీరే సమస్యేనా అని మనం నిరుత్సాహ పడుతుంటాం. సాధారణంగా మనం మనకున్న సమస్యలు తీరడానికి ఇటు గవర్నమెంటువారిపైనగాని, అటు దేవుని పైనగాని భారం వేస్తున్నాం. కాని, ఇందులో ఒక విషయం మనం గుర్తుంచుకోవాలి. దేవుడైనా, గవర్నమెంటైనా మన సమస్యలు తీర

డానికి సహాయపడాలంటే మన కృషి ఎంతవరకు ఉందో దానిపైన ఆధార పడి ఉంటుంది. మన కృషి లేనిది ఇతరుల సహాయం రాదు. ఒకవిధంగా మనమంతా సమస్యలు తీరడానికి ఏదోరకంగా కష్టపడుతూనే ఉంటాం. కానీ కష్టానికి తగినంత ఫలితం కావాలంటే పరకమైనటువంటి ప్రయత్నం మనం చేస్తున్నాం అనేది ముఖ్యం. ప్రతిపనిలోనూ బుద్ధి బలం, ముందు చూపు ఉంటేనేగాని ఫలితం దక్కదు. దీనికి మన ఆలోచనల్లోనూ, చేసే పనుల్లోనూ మార్పులు రావాలి. పాత పద్ధతులు కొన్ని మనకు తగినంత ఫలితం ఇవ్వకపోతే కొత్త పద్ధతులను అనుసరించాల్సిన అవసరంఉంటుంది. ఈనాడు మనం పనిచేసే ప్రతిరంగంలోనూ లాభదాయకమైనటువంటి ఎన్నో పద్ధతులు శాస్త్రకారులు కనిపెట్టారు. ఉదాహరణకు వ్యవసాయం లోనూ, బర్రెల పెంపకంలోనూ, కోళ్ళ పెంపకంలోనూ ఎన్నో కొత్త పద్ధతులు కనిపెట్టారు. ఈ పద్ధతులన్నీ ఆచరణలో పెట్టడం జరగటంలేదు. దీనికి కారణాలు మనం గుర్తించాలి. కొన్ని తెలియక ఆచరణలోపెట్టడం లేదు. మరికొన్ని తెలిసికూడా ఆచరించటంలేదు. ముఖ్యంగా మనలో ఒక విధమైన నిరుత్సాహముంది. ఇవన్నీ మనకెందుకు, అవి ఉన్నవారికేనని అనుకోవటం పరిపాటి అయిపోయింది. దీనివల్ల నష్టపోయేది మనమే. మరి కొన్ని పద్ధతులు పాటించాలంటే దానికి కొంత ఖర్చు అవుతుందనే సాకుతో ఆ పనిని తాత్సారం చేయటం జరుగుతుంది. కాని ముందు ముందు అదే పెద్ద సమస్యగా మారి ఎక్కువ ఖర్చు చేయవలసిన అవసరం వస్తుంది. దీనినే మనం 'గోటితోపోయే దానికి గొడ్డలి అవసరమయ్యింది' అనే సామెతగా చెప్పుకుంటాం. ఉదాహరణకు పశువుకు ఒక చిన్న జబ్బు చేస్తే దానిపట్ల మనం వెంటనే శ్రద్ధ చూపక, చిట్కా వైద్యాలకు పోయినందువల్ల ఆ జబ్బు పెద్దదై నష్టం కలిగిస్తుంది. ఇదే విధంగా మనుషులకు వచ్చిన జబ్బులను గురించి కూడా అశ్రద్ధచేస్తాం. తగిన సమయంలో వాటి నివారణోపాయం కోసం డాక్టర్లను సంప్రతిస్తే సమస్యలు సులభంగా తీరిపోతాయి. భూమి విషయంలో కూడా మనం అదే పొరపాటు

చేస్తుంటాం. మనకీనాడు ఆదాయం పెంచుకోడానికీ, ఆరోగ్యం బాగు పరుచుకోడానికీ, వ్యవసాయం, ఇతర వృత్తులను ఇంకా మెరుగుపరుచుకోడానికి ఎన్నో వసతులు కల్పించబడ్డాయి. ప్రభుత్వఉద్యోగులనూ,సంస్థలనూ మనకు సహాయం చేయడానికి నియమించటం జరిగింది. కాని మనం ఈ వసతిని ఉపయోగించుకోవటంలేదు. దీనికి ముఖ్యమైన కారణం గురించి మనం ఆలోచించవలసిన అవసరం చాలా ఉంది. ఆలోచించగా, దీనికి ముఖ్య కారణం మన గత అనుభవమే అని తేలుతుంది. గతంలో మనకు వసతులు చాలా స్వల్పంగా ఉండేవి. ఆ వసతులను మనం వినియోగించుకోడంలో చాలా ఇబ్బందులకు గురయ్యాము. ఏ సంస్థను ఆశ్రయించినా మనకు సరైన ప్రోత్సాహమూ, లాభమూ లేకపోయేది. దీనివల్ల ఆ సంస్థలంటే, ఉద్యోగులంటే నమ్మకంలేక వాటిమీద ఒక విధమైనటువంటి ఏహ్యాభావం మనలో జీర్ణించుకుపోయింది. ఇప్పుడు కాలం మారినందువల్ల ప్రజా ప్రభుత్వం ఏర్పడినందువల్ల, ఆ సంస్థలూ, ఆ ఉద్యోగులూ మనదగ్గరకే వచ్చి సలహాలూ, సహాయమూ అందజేయడానికి నియమించబడ్డారు. వారిపట్ల మనలో జీర్ణించుకుపోయిన అపనమ్మకంతోనూ, ఏహ్యాభావంతోనూ, వారి సలహాను, సహాయాన్ని అందుకోడంలో ఉత్సాహం చూపటంలేదు. దీనివల్ల ఎవరికి నష్టం? అవసరం మనది. కాబట్టి ఉన్న అవకాశాన్ని ఎంత కొద్దిదైనా దానిని మనం జారవిడవకుండా లాభం పొందాలి. మనం ఎప్పుడైతే ఉత్సాహంగా ముందుకు వచ్చి సలహాలు, సహాయం కోరతామో అప్పుడే సంస్థలు గానీ, ఉద్యోగులుగానీ మనకు ఉపయోగపడతారు. మన అవసరాలను గమనించి సంస్థలు తమంతట తామే మన దగ్గరకు రావటం చాలాకష్టం. ఒక ఉద్యోగి ఎంతోమంది అవసరాలను తనంతటతానే తెలుసుకోవడం చాలా కష్టం. కాబట్టి మనకు అవసరమైనప్పుడు మనమే ఆ ఉద్యోగికి తెలియబరిచి సలహా పొందటం అవసరం. ఉదాహరణకు ఒక వ్యవసాయ విస్తరణాధికారి బ్లాకులో ఉన్న సుమారు వంద గ్రామాల రైతులకు సలహాలు ఇవ్వవలసి ఉంటుంది. కాబట్టి ఆ అధి

కారి ప్రతిగ్రామంలోని ప్రతి రైతు కుటుంబాన్ని కలుసుకోటం సాధ్యం కాదు. అలాగే ఇతర అధికార్లు కూడా. మనం తెల్సుకోవాల్సిన ముఖ్య విషయమేమిటంటే మనకు సహాయ సహకారాలు అందించటానికి ఏయే అధికారులు మన బ్లాకు స్థాయిలో ఉన్నారనేది. వ్యవసాయ విషయాలపై సలహాలు పొందటానికి, బ్లాకు స్థాయిలో వ్యవసాయ విస్తరణాధికారి ఉంటాడు. అదేవిధంగా పశువులకు సంబంధించిన విషయాలు, సలహాలు, సహాయాలు అందజేయటానికి పశువుల ఇన్స్పెక్టర్ ఉంటాడు. తర్వాత రకరకాలైన గ్రామీణ బ్యాంకులు, కేంద్ర సహకార బ్యాంకులు, వ్యవసాయ అభివృద్ధి బ్యాంకులూ, జిల్లా సన్నకారురైతుల అభివృద్ధి సంస్థల నుండి ఆర్థిక సహాయాన్ని పొందటానికి సహకార విస్తరణాధికారి సహాయపడతాడు. కుటీర పరిశ్రమలు, చిన్న పరిశ్రమలు, చేతివృత్తులూ చేసుకునే వారికీ, చేసుకోదలచినవారికీ పరిశ్రమల విస్తరణాధికారి సాయం లభిస్తుంది. పంచాయతీ వ్యవహారాలు చూడటానికి ఒక అధికారి ఉంటాడు. ఈ అందరు అధికార్లు బి.డి.ఓ. అజమాయిషీ కింద పనిచేస్తారు. మన ఆరోగ్య విషయాల గురించి సహాయం చేయటానికి, ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో డాక్టర్లు, ఆరోగ్య కార్యకర్తలూ ఉంటారు. పైన చెప్పిన దాన్ని బట్టి ప్రతివిషయంలోనూ మనకు సహాయం, సహకారం అందటానికి అవకాశమున్నదని తెలుస్తుంది. ఈ అవకాశాన్ని మీరు ఉపయోగించుకోవడానికిప్రయత్నించటం అన్నిటికంటె ముఖ్యమైన విషయం.మీకు సహాయం, సలహాలు అందజేయడానికి, ఇంతమంది ఉద్యోగులూ, సంస్థలూ ఉన్నప్పటికీ అన్ని ముఖ్యమైన విషయాలపైన మీరు కొంత సమాచారం తెలుసుకోటం అవసరం. అటువంటి మీకు పనికొచ్చే సమాచారం సేకరించి ఈ పుస్తకంలో పొందుపరిచాం. మీకేమైనా ప్రత్యేక సహాయం, సలహాలు అవసరమైనప్పుడు మీకు దగ్గరలో ఉన్న ఆ విషయానికి సంబంధించినటువంటి విస్తరణాధికారిని సంప్రదించాలి. ఏది ఏమైనా ప్రతి విషయం

లోనూ, తగిన సమయంలో జాగ్రత్తపడడం చాలా అవసరం. మీరు మీ ఆర్థిక, ఇతర పరిస్థితులను మెరుగుపరుచుకోడానికి ఎన్నో అవకాశాలు ఉన్నాయి. నిరుత్సాహపడక ప్రయత్నిస్తే ఎప్పటికైనా పరిస్థితులు బాగుపడి, మీరు, మీ పిల్లలు సుఖంగా ఉండే అవకాశాలు ఉన్నాయి.

---

# సహకారం

| | | |
|---|---|---|
| ప్రతినిధి | నిర్ణయం | కార్యక్రమం |
| ఉత్సాహం | హక్కు | బాధ్యత |
| ముఖ్యం | చర్చ | సంఘం |
| ఆర్థిక సమస్య | ఐక్యత | ప్రభుత్వం |
| ధైర్యం | | వృత్తి |
| అభిప్రాయం | | |

మనది ప్రజారాజ్యం. అంటే ప్రజలకు సంబంధించిన విషయాలపై నిర్ణయాలు ప్రజలు, వారి ప్రతినిధులు తీసుకుంటారు. దీనివల్ల ప్రజలకు మేలుకలగని నిర్ణయాలు తీసుకోటం జరగదు. కానీ, మనలో చాలామంది నిర్ణయాలు తీసుకొనుటకు సంబంధించిన కార్యక్రమంలో ఉత్సాహంచూపి ఎక్కువగా పాల్గొనటం జరగటంలేదు. దీనివల్ల కొద్దిమంది మాత్రమే ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని నిర్ణయాలు తీసుకొనినచో అవి అందరికీ ఉపయోగంగా ఉండకపోవచ్చు. ప్రజలకు సంబంధించిన విషయాలపై ప్రజలే నిర్ణయాలు తీసుకోవటమనేది ఒక ముఖ్యమైనహక్కు. ఈ హక్కును మనం సుమారు ముప్పై ఏండ్ల కిందట సంపాదించినాము. ఈ హక్కు మనకు ఉపయోగపడాలంటే దీనితోపాటు మనము కొన్ని బాధ్యతలుకూడా చేపట్టవలసి వుంటుంది. బాధ్యతలు నెరవేర్చడానికి కొన్ని ముఖ్యమైన గుణాలు మనం అలవరచుకోవలసి ఉంటుంది. వాటిలో ముఖ్యమైనది, ఏ విషయాలపైనయితే నిర్ణయాలు తీసుకోదలచినామో, ఆ విషయాల గురించి సమాచారం సేకరించి, ఆలోచించి, అందరూ చర్చించి అర్థం చేసుకోటం. ఇది చాలా ముఖ్యమైన బాధ్యత. ఎందుకంటే ఏ నిర్ణయాలైతే

మనం తీసుకుంటామో వాటి ప్రభావం మనపైన, సంఘంపైన చాలా ఉంటుంది. అంతేగాక, ప్రజలందరూ సమానమేనని, అందరినీ సమానంగా, గౌరవమర్యాదలతో చూడాలనే భావం అందరిలోనూ కలగాలి. అప్పుడే అందరికీ లాభించే నిర్ణయాలు చేయగలుగుతాం.

మన ఆర్థిక సమస్యలూ, ఇతర సమస్యలూ తీరాలంటే ఎవరికి వారే గాక అందరూ కలిసి ఒకరికొకరు సహాయపడి పనిచేయాలి. పని బాధ్యతలు, ఫలితాలు అందరికీ చెందాలి. అంటే మనం సహకార సంఘాలుగా ఏర్పడి ఎన్నో సమస్యలను ముఖ్యంగా ఆర్థిక సమస్యలను ఎదుర్కోవచ్చు. కానీ సామాన్య ప్రజలలో ఈ సహకార సంఘాలను గురించి ఎన్నో అనుమానాలు, అపోహాలు ఉన్నాయి. దీనికి ముఖ్యమైన కారణం ఆ సంఘాలు సరిగా పనిచేయక, అందరికీ ఉపయోగపడక, కొందరికి మాత్రమే ఉపయోగపడటంవల్లనే. ఫలితాలు కొంతమందికే ఎందుకు కలుగుతున్నాయి అనే విషయాన్ని మనం ఆలోచించి తగిన మార్గం కనుక్కోటం చాలా అవసరం. దీనికి ముఖ్య కారణం సామాన్య ప్రజలు తమ హక్కును తెలుసుకొని ధైర్యంగా సహకార సంఘం విషయాలలో చొరవ తీసుకొని పాల్గొనకపోవటమే. ఇక్కడ మన మింకొక విషయం కూడా తెలుసుకోవలసిన అవసరం ఉన్నది. అదేమిటంటే ప్రతివారికి ప్రతి విషయంలోనూ ప్రత్యేక అభిప్రాయం ఉండవచ్చుననేది. అదికూడా ఒక హక్కే కాబట్టి, ఇతరుల అభిప్రాయాల గురించి మనకు సహనం ఉండాలి. అందరూ తమతమ అభిప్రాయాలు వ్యక్తపరచి వాటిని చర్చించి అందరికీ సమ్మతమైన నిర్ణయం తీసుకోటం అలవరచుకోవాలి. అలాంటి సహనంలేకపోతే సహకారముండదు.

ఈనాడు ప్రజలకు అనేక సహకార సంస్థలు ఏర్పరచుకొనే అవకాశాలు ఉన్నాయి. వీటికి సహాయం చేయడానికి ప్రభుత్వమూ, బ్యాంకులూ, అనేక ఇతర సంస్థలూ సిద్ధంగా ఉన్నాయి. వాటి నుంచి

సహాయం 'పొందాలం'టే మనలో మనకు సహకారం ఎంతైనా అవసరం. వీటి సహాయంతో మనం సహకార పరపతి సంఘాలు, సహకార వినిమయ సంఘాలు, సహకార బ్యాంకులు, వృత్తులకు సంబంధించిన సంఘాలు ఏర్పరచుకొని ఎన్నో లాభాలు పొందవచ్చు. ప్రభుత్వంలో ఉన్న సహకార శాఖ ఉద్యోగులు మనకు ఈ సంఘాలు పెట్టుకోవడానికి కావలసిన సలహాలు, సహాయం, అందజేస్తారు. వారి సహాయం కూడా కోరాలంటే మనలో ఉత్సాహం, ఐకమత్యం, బాగుపడాలనే కోరిక అవసరం.

---

# కష్టపడేవారికి సాయం

| | | |
|---|---|---|
| షెడ్డు | ఇష్టం | కలెక్టరు |
| కరెంటు | కష్టం | సబ్సిడీ |
| బ్యాంకు | ఇస్త్రీ | సర్పంచ్ |
| ఖర్చు | గ్రామాభివృద్ధి | శేర్లు |
| సంస్థ | అధ్యక్షులు | |

పొందూరు చిన్న ఊరు. చిన్నా, పెద్దా కలిపి నాలుగు వందల కుటుంబాలు ఉంటాయి. అందులో చాలామంది చిన్నరైతులు. అలాంటి వారిలో రామయ్య ఒకడు. రామయ్య బీదరైతు. అతనికి రెండెకరాల మెట్టచేను ఉంది. పంటకు వాన నీరే ఆధారం. వేరుశెనగ, జొన్న, సజ్జవంటి పంటలే వేస్తారు. అవి, అంతగా పండవు. పండింది వాళ్ళ అవసరాలకు చాలదు. రామయ్య పక్కచేను వెంకయ్యది. వెంకయ్యకూ రెండెకరాల చేను ఉన్నది. వెంకయ్యా బీదరైతే. ఇద్దరికీ నీటివసతి లేదు. పెద్ద బావి తవ్వించి కరెంటు మోటరు పెడితే మిర్చి ఏపుగా పండించవచ్చునన్నారు తెలిసిన చుట్టాలు. వీటిపై రాబడి ఎక్కువ. బావికి మూడువేలు, కరెంటు మోటరు, షెడ్డుకు మూడువేలరూపాయలు కావాలి. ఇంత డబ్బు ఎవరి దగ్గరా లేదు. ఎందుకంటే వాళ్ళుబీదవాళ్ళు. పండిన కొద్దిపంట ఇంటి ఖర్చులకే చాలదు. అందుకే అప్పుడప్పుడు అప్పు చేయడం తప్పడంలేదు. ఆ అప్పుమీద వడ్డీ ఎక్కువ. ఇద్దరికీ బావి, కరెంటు మోటరు కావాలి. అవి ఉంటే వారి కష్టాలు తీరతాయి. పక్క ఊరు మెట్టూరులో కొత్తగా బ్యాంకు పెట్టారు. చిన్న రైతులకు అప్పులిస్తారని చెప్పారు. రామయ్య, వెంకయ్య ఒకరోజు బ్యాంకుకు వెళ్ళారు. బ్యాంకు మేనేజరుకు ఇద్దరూ తమ

అవసరాలు చెప్పుకున్నారు. మరుసటిరోజు బ్యాంకు మేనేజరు పొందూరు వచ్చాడు. ఇద్దరి భూములు చూశాడు. వారి అవసరాలు అంచనా వేశాడు. నిజమే! బావికి మూడువేలు కావాలి, కరెంటు మోటరుకు, షెడ్డుకు మరో మూడు వేలు కావాలి. ఇద్దరి చేలు పక్క పక్కనే. ఇంత అప్పు ఒక్కరికి దొరకదు. దొరికినా తీర్చటం కూడ కష్టమే! ఒక్క బావి, ఒక్క కరెంటు మోటరు నాలుగెకరాలకు తేలిగ్గా నీరు అందిస్తుంది. అది ఇద్దరికీ తెలుసు. బ్యాంకు మేనేజరు రామయ్య, వెంకయ్యలకు సాయం చేస్తానన్నాడు.

పొందూరుకు 20 మైళ్ళలో బ్లాకు ఆఫీసు ఉంది. బ్యాంకు మేనేజరు సలహాపై ఇద్దరూ గ్రామాభివృద్ధి అధికారిని కలిసారు. ఆ తరవాత బ్లాకు అఫీసులో సహకార విస్తరణాధికారిని, వ్యవసాయ విస్తరణాధికారిని కలిశారు. ఒకరోజు ఉదయం, వారుకూడా పొందూరువచ్చి ఇద్దరి పొలాలు చూశారు. చూసిన తరవాత ఇట్లా చెప్పారు. అప్పుడు బ్యాంకు మేనేజరు కూడ వచ్చాడు.

"మీరిద్దరూ కలిసి బతికితే ఎక్కువ లాభం. ఇద్దరికీ బావి, కరెంటు మోటరు కావాలి. అంటే ఆరువేల రూపాయలు కావాలి. ఇంత అప్పు ఒక్కరికీ దొరకదు. దొరికినా తరవాత తీర్చడం కష్టం. ఒక బావి, ఒక కరెంటు మోటరు తేలిగ్గా నాలుగు ఎకరాలకు నీరు అందిస్తుంది. ఇద్దరూ కలిసి, మీ భూమి సరిహద్దులో బావి తవ్వించి, కరెంటు మోటరు పెట్టుకోండి. ఇద్దరూ కలిసి నీరు పెట్టుకోండి. చెరి మూడువేలు అప్పు సరిపోతుంది. రెండున్నర ఎకరాలవరకు మెట్టభూమి గల రైతులు సన్నకారు రైతులు. సన్నకారు రైతులకు అప్పు ఇప్పించేది జిల్లా సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ. జిల్లా కలెక్టరు దీనికి అధ్యక్షులు. మీకు కావలసిన అప్పులో మూడో వంతు ప్రభుత్వం ఉచితంగా ఇస్తుంది. ఇది మిమ్మల్ని బాగుచేయడానికి, ఎక్కువ పంట పండించటానికి, మీ భార్యా బిడ్డలు సుఖంగా ఉండటానికి, మీ పిల్లలను బాగా చదివించటానికి.

"రామయ్యా! మీరు బావి తీయించండి. మీకు మూడువేల రూపాయలు కావాలి. దానిలో ఒక వేయిసన్నకారు రైతుల అభివృద్ధిసంస్థ ఇస్తుంది. ఈ వెయ్యి రూపాయలు తీర్చనక్కరలేదు. బ్యాంకువారు రెండు వేల రూపాయలు ఇస్తారు. దీనిపై వడ్డీ సంవత్సరానికి, నూటికి పన్నెండు రూపాయలు ఉంటుంది. అంటే నెలకు నూటికి ఒక్కరూపాయి అన్న మాట. ఇంత తక్కువ వడ్డీకి డబ్బు ఎక్కడా అప్పు దొరకదు. ఈ అప్పు మూడేండ్లలో తీర్చాలి. మీకు ప్రతి ఆరు నెలలకు పంట వస్తుంది. పంట వచ్చినప్పుడల్లా అప్పులో కొంత కట్టాలి. అంటే వాయిదాల పద్ధతి అన్న మాట. ఏడాదికి రెండు వాయిదాలు. ఇట్లా 3 ఏండ్లలో పూర్తి బాకీ తీర్చాలి.

వెంకయ్యా! మీకు కరెంటు మోటరుకూ, షెడ్డుకూ మూడువేల రూపాయలు ఇస్తారు. రామయ్యకు వలెనే ఒక వెయ్యిరూపాయలు మీకు కూడ సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థవారు ఉచితంగా ఇస్తారు. దీన్ని సబ్సిడీ అంటారు. డబ్బు మీకు ఇవ్వరు. మీకు అప్పుఇచ్చే బ్యాంకుకిస్తారు. బ్యాంకువారు మీకు కరెంటు మోటారు కొని ఇస్తారు. షెడ్డుఖర్చుకూడా ఇస్తారు. అంతా కలిపి మూడువేలు మించగూడదు. అప్పు తీర్చడం వాయిదాల పద్ధతి-రామయ్యలాగానే! కాబట్టి ఇద్దరి సరిహద్దులో బావి తీయించుకోండి. కరెంటు మోటరు పెట్టుకోండి. బావి, కరెంటు మోటరు ఇద్దరూ వాడుకోండి. ఇది ఇద్దరికీ లాభం. ఇట్లా కలిసి చేసుకోకపోతే బావీ ఉండదు, కరెంటు మోటరూ ఉండదు. ఎక్కువ ఆదాయం వచ్చే పంటలు పండించలేరు."

రామయ్యా, వెంకయ్యా వాళ్ళలో వాళ్ళు మాట్లాడుకున్నారు. ఇది తమ పాలిట వరప్రసాదం. ఇద్దరికీ ఈ సలహా నచ్చింది. వెంటనే సరే నన్నారు.

రామయ్య:- "అయ్యా! ఇది మా ఇద్దరికీ ఇష్టమే. ఇప్పుడు మేం ఏం చెయ్యాలి?"

సహకార విస్తరణాధికారి:- "తెలుగులో అచ్చుదరఖాస్తుఫారం ఉంటుంది. అది నింపి, పహాణి మరియు దరఖాస్తు పట్వారి/కరణంచేత సంతకం చేయించి బ్లాకు ఆఫీసులో ఇవ్వండి. అది మేము జిల్లా కేంద్రంలో ఉన్న సన్నకారు రైతుల అభివృద్ధిసంస్థకు పంపిస్తాం. తరవాత అది మంజూరు అవుతుంది. మెట్టూరు బ్యాంకులో అప్పుకు దరఖాస్తు పెట్టండి. మీ పని జరుగుతుంది."

అదే సమయానికి ఆ ఊరి కరణం, కొందరు రైతులు, చేతివృత్తులవారు కూడ వచ్చారు. అయిదెకరాల పొలం ఉన్న రైతు గంగన్న ఇట్లా అడిగాడు.

"అయ్యా! రెండున్నర ఎకరాలకంటే ఎక్కువ పొలం ఉంటే అప్పు ఇవ్వరా?"

సహకార విస్తరణాధికారి:- "ఇస్తారు! సన్నకారు రైతులను రెండురకాలుగా విభజించారు. రెండున్నర ఎకరాల లోపు మెట్టగాని, లేదా ఎకరం మాగాణిగాని ఉన్నవారికి జిల్లా సన్నకారు రైతుల అభివృద్ధిసంస్థ మూడోవంతు సబ్సిడీ ఇస్తుంది. మీరు ఒక రకం, అంటే మరీ చిన్నరైతులన్నమాట. రెండున్నర ఎకరాల పైన, ఐదెకరాల లోపు మెట్టభూమి లేదా ఎకరంపైన, రెండున్నర ఎకరాల లోపు మాగాణి ఉన్నవారికి నాలుగోవంతు సబ్సిడీ వస్తుంది. మీరు రెండో రకం రైతులు. అప్పు అందరికీ ఇవ్వరు. కష్టపడి ఎక్కువ పంట పండించే వారికి, అప్పు నమ్మకంగా తీర్చేవారికి బ్యాంకువారు అప్పులిస్తారు. బ్యాంకువారు మీ చేలు, పొలాలు, మీ మంచి చెడులూ, శ్రద్ధాసక్తులూ చూచి అప్పులిస్తారు. బ్యాంకువారు అప్పులివ్వదలచిన సన్నకారు రైతులకే సబ్సిడీ వస్తుంది."

కరణంగారు:- "అయ్యా! బ్యాంకు మేనేజరుగారూ! అయిదెకరాలకు మించిన భూమి ఉన్న రైతులుకూడా ఎందరో కష్టాల్లో ఉన్నారు. వాళ్ళకు అప్పులిస్తారా?"

బ్యాంకు మేనేజరు:- "బ్యాంకులు ఎవరికైనా అప్పులిస్తాయి. అప్పు తీరుస్తాడనే నమ్మకం మీరు కలిగించాలి."

సర్పంచ్:- "ఐదెకరాల పై రైతులకు ఏమైనా సబ్సిడీ వస్తుందా?"

సహకార విస్తరణాధికారి:- "ఐదెకరాలపై మెట్టగానీ, లేక రెండున్నర ఎకరాలపై మాగాణిగాని ఉన్నవారికి సబ్సిడీ రాదు. వీరు సన్నకారు రైతుల జాబితాలోకి రారు. ప్రభుత్వం చిన్న కమతాలుగల బీద రైతులకే ఈ పథకం పెట్టింది."

కరణం:- "మరి, ఇతర రైతులకు బ్యాంకు ఎంత అప్పు ఇస్తుంది?"

బ్యాంకు మేనేజరు:- "అప్పు అవసరాన్నిబట్టి ఇస్తుంది. అప్పు తీసుకొనే వ్యక్తి నిజాయితీ, అప్పు తీర్చగలిగే శక్తి, శ్రద్ధగలవారికి అప్పులిస్తాం. వ్యవసాయాభివృద్ధికి మాత్రమే అప్పులిస్తాం."

సర్పంచ్:- "ఎంత అప్పు ఇస్తారు?"

బ్యాంకు మేనేజరు:- "చెప్పాను గదా! మీ రైతు అవసరాన్నిబట్టి. బావి తవ్విస్తే ఇస్తాం! ఇంజను పెట్టుకుంటే ఇస్తాం. కరెంటులేని ఊరిలో రైతులకు ఆయిలు ఇంజనుకు అప్పు ఇస్తాం. పండ్ల తోటలు పెంచుటకు ఇస్తాం. భూమి చదును చేయించు కోటానికి ఇస్తాం. ఎద్దులు, ఆవులు, గేదెలు కొనుటకు ఇస్తాం. అయితే ఈ అప్పు అయిదు వేలకు మించదు. అప్పు ఎంత ఎక్కువ తీసుకుంటే మీకే అంత బరువు కదా!

ఈ అప్పులు మూడేండ్లలో తీర్చవలసి ఉంటుంది. పంట వచ్చినప్పుడల్లా ఒక వాయిదా కట్టాలి. అంటే ప్రతి ఆరు నెలలకొకసారి కట్టాలి. గేదెలకు, ఆవులకు అప్పుతీసుకుంటే అవి ఈనిన నెలనుండి ప్రతినెలా కట్టాలి."

సర్పంచ్ :- "వడ్డీ ఎంతవుతుంది?"

బ్యాంకు మేనేజరు:- "వడ్డీ నూటికి సంవత్సరానికి పన్నెండు రూపాయలు ఉంటుంది."

సర్పంచ్:- "ఇంతసేపూ చిన్నా, పెద్దా రైతుల గురించే చెప్పారు. మరి మా ఊరిలో ఎందరో ఇతర వృత్తులవారూ, కూలి జనం కూడ ఉన్నారు. వారికి ఈ అప్పులు ఇస్తారా?"

బ్యాంకు మేనేజరు:- "ఇస్తారు. ఇస్త్రీషాపు పెట్టుకోడానికి, మంగలిషాపు పెట్టుకోడానికి, గొర్రెలు, మేకలు కొనుక్కోడానికి, వడ్రంగము పనిముట్లు కొనుక్కోడానికి అప్పు లిస్తారు. ఈ అప్పులు మన ఇంటి అవసరాలకు ఇవ్వరు. తిండిఖర్చు, గుడ్డ ఖర్చు, పెండ్లి ఖర్చులకు ఇలాంటి అప్పులు చేయరాదు. ఆదాయం పెంచుకోవాలని, ఎప్పుడూ సుఖంగా ఉండాలనీ కోరుకునేవారు మాత్రమే ఈ అప్పులు చేయాలి. అలాంటి వారికి మాత్రమే ఈ అప్పులు ఇస్తారు. ఈ అప్పులు కూడా మూడేండ్లలో తీర్చాలి."

సర్పంచ్:- "బలహీన వర్గాలవారికి ఏం అప్పులు ఇస్తారు?"

బ్యాంకు మేనేజరు:- "పైన చెప్పినవాటిలో దేనికైనా ఇస్తారు. కొద్దిఅప్పు తీసుకొని, అది తీరుస్తూ, ఆదాయాన్ని పెంచుకుంటూ

పోవాలి. ఉదాహరణకు రెండు మేకలకుగాని, గొర్రెలకుగాని అప్పు ఇచ్చామనుకోండి. అసలు ఇచ్చాం కూడా. వెంకన్నది పిల్లల మర్రి గ్రామం. అతని వయస్సు 30 సంవత్సరాలుంటుంది. మెటూరుకు రాకముందు గత రెండు సంవత్సరాలు నేను ఆ ఊరి బ్యాంకులో పనిచేశాను. రెండేండ్ల క్రింద ఆరువందల రూపాయలు అప్పు ఇచ్చాం. దానితో రెండు గొర్రెలు కొన్నాడు. సంవత్సరం అయ్యేటప్పటికి అవి రెండు సార్లు ఈనాయి. తడవకు రెండు పిల్లలు పెట్టాయి. సంవత్సరం గడిచేటప్పటికి తల్లీ పిల్లలు మొత్తం 10 అయినాయి. మొదటి ఈత పిల్లలకు, తల్లి రెండో ఈత ఈనేసరికి ఆరు నెలల వయస్సు వచ్చింది. మొదట రెండింటిని ఒక్కొక్కటి రూ. 160/- చొప్పున అమ్మాడు. వచ్చిన డబ్బు రూ. 320/- బ్యాంకులో కట్టాడు. మరో మూడు నెలలకు మిగతా రెండు అమ్మేశాడు. వాటికి నాలుగువందల రూపాయలు వచ్చాయి. అంటే పదిహేను నెలలకు అప్పు పూర్తిగా తీర్చేశాడు. తల్లి గొర్రెల రెండు, పిల్లలు నాలుగు మొత్తం ఆరు మిగిలాయి. మరో ఏడాదికి ఒక్కొటి రెండుసార్లు ఈనింది. అంటే ఒక్కొక్కటి తడవకు రెండు చొప్పున మొత్తం ఎనిమిది పిల్లలు పెట్టాయి. అంటే మొత్తం 14 అయినాయి. కట్టుగారు కొచ్చిన 2 మరకలను ఉంచుకొని తక్కి 12 ను అమ్మివేశాడు, నేను మెట్టూరుకి వచ్చేముందే. రెండు రూపాయలు వచ్చాయి—చిన్నా, పెద్దా అన్నిటికీకలిపి. వెంకన్న కష్టపడి పనిచేసేవారికి, తీసుకున్న అప్పు చెల్లించేవారికి బ్యాం ఎప్పుడూ సాయపడుతుంది. అదే ఊరిలో భీమయ్య అనే హారిజన

వెయ్యి రూపాయలు అప్పు ఇచ్చినాము. మంచి గేదెను కొన్నాడు. దానితో అతని కుటుంబం గడుస్తుందనిచెప్పాడు. ఒక్క పూట రెండు శేర్ల పాలిస్తుంది. అంటే రెండుపూటలా నాలుగుశేర్ల పాలిస్తుంది. 3 శేర్ల పాలు అమ్ముతాడు. ఆరు రూపాయలు వస్తుంది. గేదె దాణాకు, మేతకు రెండు రూపాయలు ఖర్చవుతుంది. రెండు రూపాయలు ఇంటి కింద ఖర్చుపెట్టుకుంటాడు. రెండు రూపాయలు అప్పు తీరుస్తాడు. ఈ అప్పుకు వడ్డీకూడా చాలా తక్కువే! సన్న కారు రైతుల అభివృద్ధి సంస్థ నుండి 333 రూపాయలు సబ్సిడీ కూడా వచ్చింది. శ్రద్ధగా పనిచేసి రెండేండ్లలో అప్పు తీర్చాడు. రెండు దూడలూ, గేదె మిగిలాయి. ప్రక్క ఊరి కామందు రెండున్నర వేలకు మూడు శాల్తీలను అడిగాడని చెప్పాడు. కాబట్టి కష్టపడేవారికి సాయం ఎప్పుడూ ఉంటుంది."

అప్పటికి ఉదయం పదకొండు గంటలయింది. బ్యాంకు మేనేజరు అందరి వద్దా సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు. సర్పంచ్ సహకార విస్తరణ శాఖాధికారిని ఇట్లా అడిగాడు.

"చూడండి ఈ.ఓ. గారూ! అన్ని బ్యాంకులూ ఈ అప్పులిస్తాయా?"

విస్తరణశాఖాధికారి:—"గ్రామీణ బ్యాంకులు, స్టేటు బ్యాంకు, ఆంధ్రా బ్యాంకు, కెనరా బ్యాంకు, సెంట్రల్ బ్యాంకు, సిండికేట్ బ్యాంకు మొదలయిన అన్ని బ్యాంకులూ ఈ అప్పులిస్తాయి. ఇవికాక వ్యవసాయాభివృద్ధి బ్యాంకు, కేంద్ర సహకార బ్యాంకులు కూడా ఈ అప్పులిస్తాయి. వ్యవసాయానికి, ఇతర వృత్తులవారికి, సబ్సిడీకి కావలసిన అన్ని

అప్పు దరఖాస్తులు బ్లాకు ఆఫీసునుండి జిల్లా సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థకు మేమే పంపుతాం. సబ్సిడీ అందరికీ రాదని చెప్పాను కదా! అయిదెకరాల చేనుగాని, రెండున్నర ఎకరాలకంటే ఎక్కువ మాగాణిగాని ఉన్నవారికి సబ్సిడీ రాదు. అలాంటి రైతులు నేరుగా బ్యాంకుతో దరఖాస్తు పెట్టుకుని అప్పు తీసుకోవచ్చు."

అప్పటికి ఒంటిగంట అయింది. అందరూ ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు. రామయ్య, వెంకయ్యలు బ్లాకు అధికార్లకు కృతజ్ఞత చెప్పి ఇంటికి వెళ్ళారు.

---

# ఇంటింటా చెట్లు

| | | |
|---|---|---|
| బస్తీ | పట్నం | సంవత్సరం |
| మైళ్ళు | నిమ్మ | కృషి |
| శాస్త్రం | కొబ్బరి | |

నరసయ్యది కనుమూరు. కనుమూరు చిన్న ఊరు. అది బస్తీకి పదిహేను మైళ్ళలో వుంది. చదువుకున్న మేనల్లుడు చెబితే ఇంట్లో రెండు నిమ్మచెట్లు, రెండు కొబ్బరిచెట్లు నాటాడు. నరసయ్య మేనల్లుడు గోపి. గోపి తెలివైనవాడు. వ్యవసాయశాస్త్రంలో పట్నంలో పెద్ద చదువులు చదివాడు. నరసయ్య చెట్లు నాటింది ఐదేండ్ల క్రింద. చెట్లు బాగా పెరిగి కాపుకొచ్చాయి. దీనికి నరసయ్య పడిన పెద్దకష్టం ఏమీలేదు. అప్పు డప్పుడూ పశువుల ఎరువు మాత్రం వేశాడు. తవ్వటం పెట్టాడు. నీళ్ళు పెట్టాడు. ఈ పనులు ఎవరికి ఖాళీఉంటే వారే చూసేవారు. ఎందుకంటే ఈ పనులు చాలా తేలికైనవి. మేనమామ ఊరికి ఒకరోజు మేనల్లుడు గోపి వచ్చాడు. రచ్చబండ వద్ద యువకులు కొందరు కబుర్లు చెప్పుకుంటు న్నారు. ముసలివారు తాము వయసులో ఉండగా చేసిన పనులను గురించి చెప్పుకుంటున్నారు. అదే సమయానికి నరసయ్య అటుగా వచ్చాడు. నర సకు మామ అని పిలిచే దూరపు బంధువు రామయ్యగారు అప్పుడు అక్కడే ఉన్నాడు. రామయ్య కోరికమీద నరసయ్యకూడా కూర్చున్నాడు. రామయ్య వయసుమళ్ళిన మనిషి. పనిలేని మనిషి. కబుర్లకు ఆరాటపడే పెద్దమనిషి. ఆ ఊళ్లో ఒక్క నరసయ్య ఇంట్లోనే నిమ్మచెట్లున్నాయి. కొబ్బరిచెట్లు కూడా ఒక్క నరసయ్య ఇంట్లో తప్ప ఇంకెవరింట్లోనూలేవు. ఆ మాటా, ఈ మాటా మాట్లాడుతుండగా నరసయ్య చిన్నకొడుకు రవి పదేళ్ళవాడు పచ్చికొబ్బరి తింటూ అటుగా వచ్చాడు.

రామయ్య:- "ఏరా మనమడా! పొద్దున్నే పచ్చికొబ్బరి తింటున్నావు?"

రవి :- "మా చెట్టు కాయనే తాతా! ఈ రోజు అమ్మ దేవుడికి కొబ్బరి కాయ కొట్టింది."

రామయ్య:- "ఏమిటీ! ఏరా నరసయ్యా! చెట్టు బాగా కాసిందేమిటి? మన ఊరిలోనే కాదు, మన తాలూకాలోనే ఎవ్వరూ వెయ్యలేదు నాకు తెలిసినంతవరకు."

నరసయ్య:- "అవును మామా! ఈ ఏడే మొదటి కాపు కదా! చెట్టుకు 80, 90 కాయలు దాకా ఉన్నట్టున్నాయి. మా గోపి వేయించాడివి అసలు."

రామయ్య:- "ఆ కాయలన్నీ ఏం చేస్తావురా?"(గోపి ఇదంతా వింటున్నాడు)

గోపి :- "అవును తాతా! కాయలు మన ఇంట్లోకి కావలసినవి ఉంచుకుని తక్కినవి అమ్మివేయాలి. మా చెట్ల సంగతే తీసుకోండి! రెండు చెట్లకు సుమారుగా 160—180 వరకు కాయలున్నవి. సంవత్సరంలో పండుగలకు, పబ్బాలకు 20 కంటే ఎక్కువ అవసరం ఉండదు. మిగిలినవి అమ్మివేస్తే సుమారు రూ. 200/- వస్తాయి. వచ్చే ఏడు రెండుచెట్ల కాయలకూ రూ. 400/- వస్తాయి. అట్లాగే ఐదేండ్ల కింద రెండు నిమ్మచెట్లు కూడా పెట్టాము. అవి కూడా కాస్తున్నాయి. నిమ్మచెట్టు సంవత్సరం పొడవునా కాయలు కాస్తుంది. నిమ్మకాయలు నూటికి ఐద నుండి పదిరూపాయాల ధర పలుకుతుంది. రెండు చెట్లపై సంవత్సరం మొత్తంమీద కనీసం ఈ ఏడు రూ. 500/- వస్తాయి. బాగా కృషిచేస్తే రూ. 800/- దాకా వస్తాయి. ఇది ప్రతి ఇంట్లోనూ వేసుకోవచ్చు. మీ ఊరిలో ఎన్ని కుటుంబా లున్నాయి తాతగారూ ?"

రామయ్య:-"ఉంటాయి 400 దాకా".

గోపి:- "పోనీ 100 కుటుంబాలే మా మామయ్య చేసినట్లు చేసినారనుకోండి! ఈ రోజు ఈ ఊళ్ళో సుమారు 80 వేల కొబ్బరి కాయలు కాసి ఉండేవి. అట్లాగే 50 వేల రూపాయల నిమ్మ కాయలు కాసి ఉండేవి. ప్రతి కుటుంబానికి అదనపు ఆదాయం కనీసం రూ. 1000 ఉండేది. వందమంది ఇంట్లో కొబ్బరి కాయలు, నిమ్మకాయలూ ఉంటే బేరగాళ్ళు మన ఇంటికే వచ్చి కొనుక్కుపోతారు కూడా. అట్లాగే అరటి, బొప్పాయి, మునగ చెట్లు కూడ లాభం తెచ్చిపెడతాయి.

రామయ్య:-"భలే చెబుతున్నాడయ్యా! నర్సయ్యా, నీ మేనల్లుడు,"

గోపి:- "నేను చెప్పినదాంట్లో ఏమైనా కానిపని ఉన్నదా తాతగారూ?"

రామయ్య:-"నీవు నిజం చెప్పావురా! మనవడా. నేను ఊరికే నవ్వుతూ అన్నానుగాని."

గోపి:- "అదికాదు తాతా! మీరున్నారనుకోండి. రెండుగంటలు ఇక్కడ కబుర్లు చెబుతూ కూర్చున్నారు. ఇంట్లో రెండుచెట్లు వేయించి, వాటి పెంపకం పట్టించుకున్నారనుకోండి! ఇంట్లో కూర్చునే ఏడాదికి వెయ్యిరూపాయలు సంపాదించవచ్చు గదా!"

రామయ్య:-"నిజమేరా! మనవడా. ఈ రోజే ఊరందర్నీ పిలిపిస్తాను. నీవు ఇప్పుడు చెప్పినవన్నీ అందరికీ చెప్పు. అందరి తరఫునా నీవే వెళ్ళి అందరికీ మొక్కలు తెచ్చిపెట్టు. ఏం చెయ్యాలో, ఎట్లా పెంచాలో కూడా చెప్పు. నీ పేరు చెప్పుకుంటారు."

గోపి :- "తప్పకుండా తాతయ్యా!"

# గాలిలో దీపం

| | | | |
|---|---|---|---|
| జీడిమెట్ల | అప్పు | నిమ్మ | ఊళ్ళో |
| ధాన్యం | కొబ్బరి | రెక్క | డబ్బు |
| మెట్టపైరు | డొక్క | బస్తీ | ఖర్చు |
| పెళ్ళి | ఇబ్బందులు | అమ్మేస్తాం | పెంకుటిల్లు |
| అభిప్రాయాలు | కట్టేస్తాం | కష్టం | కట్నం |
| సౌకర్యాలు | శుభ్రం | పద్ధతులు | అత్తయ్య |
| కోళ్ళు | ఉత్సాహం | ధైర్యం | మట్టిగ |
| సంతోషం | భవిష్యత్తు | | |

వెంకన్నది జీడిమెట్ల గ్రామం. ఊరు చిన్నది. ఆ ఊళ్లో 200 కుటుంబాల దాకా ఉంటాయి. వెంకన్నకు రెండెకరాల మెట్టచేను ఉంది. దానిలో జొన్న, సజ్జ, వేరుశనగ, కంది, పెసర వంటి పంటలే వేస్తాడు. వాన నీరే పైరుకు ఆధారం. కనుక ఒకేడు పండితే రెండేళ్ళు ఎండుతుంటుంది. అందుకే అప్పులుకూడా చేస్తుంటాడు.

వెంకన్నకు ఇద్దరు కొడుకులు, ఒక కూతురు.కొడుకులు పెద్దవారు. తరవాత అమ్మాయి. కొడుకులకు 12, 7 ఏళ్ళుంటాయి. కూతురుకు 4 ఏళ్ళు. పెద్దకొడుకును బడికి పంపాలనుకున్నాడు. కాని తన రెక్కాడినా డొక్కాడని పరిస్థితి. అందుకే ఎంతగా పెద్దకొడుకును చదివించాలని పట్టుదల ఉన్నా రెండో తరగతికంటే పైన చదివించలేకపోయాడు. తర్వాత పొలంపనికి పెట్టటం తప్పలేదు. కనీసం చిన్నకొడుకునైనా చదివించాలని కోరిక. వాడి నీ పడే బళ్లోవేశాడు. కూతురిని బడికి పంపాలని కూడ ఉంది.

పండేపంట తిండికి చాలదు. ఎందుకంటే కమతం చిన్నది. పంట మెట్టపంట. ఇంత పండుతుందని ఏమాత్రమూ నమ్మకంలేదు. అందుకే తనకు పనిలేనప్పుడు ఇతరులకు పనికి వెళ్తూంటాడు. వాళ్ళిచ్చే కూలిగింజలతోనూ, పండే కొద్దిపాటి పంటతోనూ సంసారం ఈడ్చుకొస్తున్నాడు. అయినా ఇబ్బందిగానే వుంది.

వెంకన్న మేనమామ రోశయ్య. వాళ్ళది సత్తెనపల్లి, వెంకన్న వూరికి చాలా దూరం. వందమైళ్ళుంటుంది, వెంకన్న వూరికి. రోశయ్య వెంకన్నకు తన చిన్నకొడుకు పెళ్ళి శుభలేఖ పంపాడు. అందరినీ రమ్మని ఉత్తరం కూడా రాశాడు. పెళ్ళికి భార్యాపిల్లలతోసహా రమ్మని రాశాడు. వెంకన్నకు రోశయ్య స్వయానా మేనమామ. తనంటే మేనమామకు ఎంతో ప్రేమ. తన మేనమామకు ఇద్దరే కొడుకులు. కూతుళ్ళు లేరు. పెద్దవాడి పెళ్ళి రెండేళ్ళ కింద జరిగింది. తన పరిస్థితి ఏమీ బాగులేక పెళ్ళికి వెళ్ళలేదు. మేనమామ ఎంతో నొచ్చుకున్నాడు. వెంకన్న కూడా ఎంతో బాధపడ్డాడు. రాను, పోను పాతిక రూపాయలు ఛార్జీలు అవుతాయి. కట్నంకానుకలకు కనీసం మరో పాతికన్నా కావాలి. అప్పుచేసి అయినా వెళ్ళాలనుకున్నాడు. ఎక్కడా అప్పు పుట్టలేదు. అందుకే వెళ్ళలేక పోయాడు. ఈసారి పెళ్ళికి తనొక్కడైనా వెళ్ళక తప్పదు. ఇంట్లో డబ్బు లేదు. అమ్మటానికి ధాన్యంలేదు. అప్పుపుట్టే నమ్మకంలేదు. ఆర్నెల్ల క్రితం కోడిని పొదగేశారు. 18 పిల్లలను చేసింది. రెండు పిల్లి ఎత్తుకుపోయింది. రెండు గద్ద తన్నుకుపోయింది. రెండు చచ్చిపోయాయి. మిగిలినవి ఏడు. అందులో నాలుగు పుంజులు, మూడు పెట్టలు. వాటికి ఆరునెలల వయసు వచ్చింది. ఏపుగానే పెరిగాయి. వాటిని అమ్మేసి వచ్చిన డబ్బుతో పెళ్ళికి వెళ్ళమని భార్య సలహా చెప్పింది. వెంకన్న భార్య సీతమ్మ. ఆమె ఉత్తమురాలు. మూడు పుంజులను, ఒక పెట్టను అమ్మేశాడు బస్తీకెళ్ళి. మొత్తం నలభై రూపాయలు వచ్చాయి. అవి తీసుకొని పెళ్ళికి వెళ్ళాడు.

పెళ్ళి రెండు రోజులుండగా వెళ్ళాడు. మేనమామ వెంకన్నను బాగా ఆదరించాడు. పెళ్ళి బాగా జరిగిపోయింది. మేనమామ ఊరునుంచి వచ్చి అప్పటికి ఎనిమిదేళ్ళయింది. మేనమామ తనవలనే బక్క రైతే. కానీ రోశయ్య పరిస్థితి ఇప్పుడు బాగానే వుంది. రోశయ్యకు రెండున్నర ఎకరాలేవుంది. అది కూడా మెట్టభూమి. మేనమామ చేను ఊరుకు సుమారు మైలు దూరం ఉంటుంది. కుటుంబం అంతా అక్కడే కాపురం ఉంటున్నారు. ఊళ్ళోని ఇల్లు రెండు వేలకు ఆరేళ్ళనాడు అమ్మికొనిపొలంలో నేపాక వేసుకున్నారు. ఊళ్ళోని ఇల్లు అమ్మికుని పొలంలో ఉండటం వెంకన్నకు బాగనిపించ లేదు. అదే అన్నాడు, మేనమామతో. దానికి రోశయ్య చిరునవ్వు నవ్వి, "పొలంలోకి మకాం మార్చటంతోనే మా కష్టాలు తీరాయిరా వెంకన్నా. పోయిన మారు నీవు వచ్చినప్పుడెట్లా ఉన్నాం, ఇప్పుడెట్లా ఉన్నాం, చూస్తున్నావుకదా! ఈ ఎనిమిదేళ్ళలో ఏం జరిగిందో చెబుతా విను. ఇక్కడకు మకాం మార్చకముందు నేను కూడా ఇప్పుడు పడుతున్న ఇబ్బందులే పడ్డాను. అప్పుడే మావూళ్ళో కొత్తగా బ్యాంకు పెట్టారు. బ్యాంకు మేనేజరు బావి తీయించుకొని, కరెంట్ మోటారు పెట్టమన్నాడు. పొలంలోకి మకాం మార్చమన్నాడు. ఎక్కువ ఆదాయం వచ్చే మార్గం చెప్పాడు. ఆయన సలహా నాకు నచ్చింది. ముందు ఇల్లు అమ్మేశాను. రెండు వేలు వచ్చింది. అయిదు వందలతో పొలంలో పాక వేశాను. మిగతా డబ్బుతో చేలో బావి తవ్వించాను. బ్యాంకువారు కరెంట్ మోటరుకు, పెడ్డుకూ మూడు వేలు అప్పు ఇచ్చారు. అర ఎకరంలో నిమ్మచెట్లు వేశాను. మరో అర ఎకరంలో కొబ్బరిచెట్లు వేశాను. అర ఎకరంలో కూరగాయలు వేస్తున్నాను. మిగతా దానిలో కొంత మెట్టపైరు, కొంత పశువుల మేతకు ఉంచాను. ఏడాది తర్వాత ఒక గేదెను కొన్నాను. గేదె, కూరగాయల మడి తిండికి, గుడ్డకు, కరెంట్ ఖర్చుకూ సరిపోయింది, అందరం ఇక్కడే ఉంటున్నాం కనక ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తూనే ఉంటాము. తీరిక

V

ఉండదు కాలం వృథాకాదు. ముచ్చట్లు పెట్టటానికి తోడు లేదుకదా! అయిదేళ్ళు అందరం కష్టపడ్డాం. నిమ్మచెట్లు, కొబ్బరిచెట్లు కాపుకు వచ్చాయి. మొదటికాపు కొద్దిగా వచ్చింది. నిమ్మచెట్లమీద వెయ్యి రూపాయలు, కొబ్బరికాయలపై వెయ్యి రూపాయలూ వచ్చాయి. తర్వాత సంవత్సరం రెండున్నరవేల నొప్పున మొత్తం అయిదు వేలరూపాయలొచ్చాయి. ఈ ఏడు ఎనిమిదివేలు వచ్చాయి. పాక తీసేసి పెంకుటిల్లు వేశాను. ఇప్పుడు ఇల్లు విశాలంగా ఉంది, కదా. వెయ్యిరూపాయల వడ్లు కొంటే సంవత్సరమంతా తిండికి సరిపోతుంది."

వెంకన్న:- "ఇంట్లో రెండు మేకలు కూడా ఉన్నట్లున్నాయి. అవి ఎందుకు మామా? వాటిని ఎవరు మేపుతారు? అవి ఒకచోట ఉండవు కదా!"

రోశయ్య:- "అవి తల్లీ, పిల్లా. తల్లి చూడిది. పిల్ల పోతు. దాని వయసు 5 నెలలు. మరో నెల, రెండు నెలలకు, పోతును అమ్మేస్తాం. కనీసం రెండువందల యాభై అయినా వస్తాయి. ఇకపోతే వాటిని మేపటం అంటావా, అవి మనచేలోనే ఉంటాయి. చాలా పొడవైన తాడుతో కట్టేస్తాం. ఎప్పుడైనా ఎవరో ఒకరం ఖాళీగా ఉన్నప్పుడు కాసేపు తిప్పుతాం. మేక తినని ఆకు లేదు కదా! అనుకుంటే ఏదైనా కష్టమే. చేస్తే ఏదీ కష్టంకాదు. పొలంలోనే కాపురముంటే కాపలా తేలిక. చేతినిండా పని ఉంటుంది. సీకు రెండో ధ్యాస రాదు. ఎప్పుడూ ఏదో ఒక కొత్త ఆలోచన వస్తూనే ఉంటుంది. మేము పొలంలోకి మకాం మార్చినప్పుడు అందరూ తలోకమాటా అన్నారు. కానీ తర్వాత వారి అభిప్రాయాలు మారాయి. ఇప్పుడీ ఊళ్ళో కనీసం పాతికమంది యిట్లా మాలాగే చేలో కాపుర ముంటున్నారు. చేసేవాడికి పని

చాలా ఉంది. ఎక్కువ సంపాదించటానికి మార్గాలూ వున్నాయి. ఎటొచ్చీ పట్టుదల కావాలి. తర్వాత కష్టపడి పనిచెయ్యాలి."

వెంకన్న:- "మామా! మీకంటె బస్తీ దగ్గర కనక పాలు అమ్ముకోవచ్చు. మాకు బస్తీ 20 మైళ్ళు ఉంటుంది. దగ్గరలో పాల కేంద్రం గూడా లేదు. మీకున్న సౌకర్యాలు మాకు లేవు మామా."

కోశయ్య:-పాల కేంద్రం దగ్గర్లో లేకపోతే నెయ్యి చెయ్యటం లాభదాయకం. శుభ్రంగా కాచి వెన్నతీసి నెయ్యి చెయ్యండి. మీ ఊరు బస్తీకి పాతిక మైళ్ళున్నా నెయ్యి అమ్ముకోవచ్చు. వారం, పదిరోజుల కొకసారి నెయ్యి బస్తీకి తీసికెళ్ళి అమ్ముకోవచ్చు. ఇట్లా నెయ్యి చెయ్యటం లాభదాయకం. మీ అత్తయ్య అట్లాగే చేస్తుంది. అందరం కమ్మగా మజ్జిగ తాగవచ్చు. నలుగురికి పోయవచ్చు. మంచిగా సంపాదించనూవచ్చు. అంతేకాదు, మన ఇంటి పక్కన పాకలో పెద్ద కోళ్ళ గూడు కూడా ఉంది. అందులో పాతిక కోళ్ళున్నాయి. కోళ్ళ విషయంలోనూ మనం తెలివైన పని చేయవచ్చు. కోడిగుడ్లు అమ్మితేనే, ఆదాయం రావాలి అనుకోవద్దు. మన దేశవాళీకోళ్ళను కూడ లే, రే వెలలు పెంచితే ఒక్కోదానిని పదిరూపాయలకు అమ్మవచ్చు."

వెంకన్న:-"నీవు చెప్పేది నిజమే మామా! అసలు ఇంట్లో కోడి పిల్లలే లేకపోతే నేనీ పెళ్ళికి రావటమే కష్టమైపోయేదె." అని తను చేసిన పని వివరించి చెప్పాడు.

కోశయ్య:-"అంతేరా అబ్బి! గాలిలో దీపం పెట్టి దేవుడా నీదే మహిమ అంటే దీపం ఆరిపోకుండా ఎట్లా ఉంటుంది. అట్లాగే మనం

కష్టపడకుండా, మన బతుకుబాట మార్చుకోకుండా, మనంచేసే పనులూ, పద్ధతులూ మార్చుకోకుండా ఉంటే మనం ఎప్పటికీ బాగుపడం. ఎవరో వచ్చి మనల్ని బాగుచెయ్యరు. మనల్ని మనమే బాగుచేసుకోవాలి. కష్టపడితే ఫలితం ఉంటుంది. మనసు ఉంటే మార్గం వుంటుంది. మనం చేసే పని మంచిదని నమ్మకం కలిగిస్తే బ్యాంకులు తప్పక సాయం చేస్తాయి—అప్పుతీసుకుని తీర్చనివాడికి వ్యక్తులేకాదు, బ్యాంకులుకూడ అప్పులివ్వవు."

వెంకన్న:-"ఏదో ఒకటి చెయ్యాలి మామా ! పెద్దాడిని చదువు మానిపించాను. అందరం కష్టపడ్డా తిండి గడవటంలేదు — చిన్నాడిని బడిలోవేసినా ఎన్ని రోజులు గడుస్తుందో చెప్పలేను."

రోశయ్య:-"వెంటనే కాపురం చేలోకి మార్చు. ఇక్కడ నేను చేసినవన్నీ చూశావుకదా ! ఒక నెలతర్వాత నేను వస్తాను. కొన్ని రోజులుండి నీకు కావలసినవి చెబుతాను."

వెంకన్న:-"నీవు నాల్గురోజులుండి నన్నోదారిని పడెయ్యి మామా! నాకిప్పుడెంతో ధైర్యంగా ఉంది. రెండెకరాల చేను ఉండి కూడా తిండికి సరిపడా సంపాదించలేకపోవటం దురదృష్టమే."

రోశయ్య:-"తప్పకుండా వస్తాను, రెండు వేలు డబ్బు కూడా సర్దుతాను. ఇప్పుడంతకంటే వీలుపడదు.మిగతాది బ్యాంకులో తీసుకుందువుగాని; నువ్వు కూడా నిమ్మ, కొబ్బరి చెట్లు వేద్దువుగాని. మంచి రకాలు ఎన్నో వచ్చాయి. పంట మన ఇంటికొచ్చి కొంటారు. బస్తీకి తీసికెళ్ళినా కాసేపట్లో అమ్ముడవుతుంది. నీకేం ఫరవా లేదు. ధైర్యంగా ముందుకు సాగు."

వెంకన్న సత్తెనపల్లిలో నాలుగు రోజులుండి తిరిగి ఇంటికి బయలు దేరాడు. వెంకన్నలో ఉత్సాహం వచ్చింది. జీవితంపై ఇదివరకటి రోత పోయింది. బంగారు భవిష్యత్తుకు రోశయ్య బాట వేశాడు. ఆ దారినపోతే చాలు. తాను ఆ దారినే నడుస్తాడు కూడా. రెండు వేల అప్పుతో బాటు, మేనల్లునికి గుడ్డలు కొన్నాడు. మేనల్లుని భార్యకు, పిల్లలకూ గుడ్డలు కొన్నాడు. సంతోషంతో సాగనంపాడు.

---

# దూడల పెంపకం

| | | |
|---|---|---|
| మట్టం | ముఖ్యాంశం | లక్షణాలు |
| శుభ్రం | పుష్టికరమైన | దుర్గుణాలు |
| జీర్ణశక్తి | | |

## తీసుకోవలసిన జాగ్రత్తలు

పశువుల పెంపకంలో దూడలను పెంచటం చాలా ముఖ్యమైన సుట్టం. సరైన పద్ధతిలో దూడలను పెంచినట్లయితే ఎక్కువ లాభంతో పాటు ఉత్తమజాతి పశువులను పొందొచ్చు. సాధారణంగా రైతులు, దూడలను ఆరు నెలల వయస్సు వరకు తల్లిపాల మీదనే పెరగనిస్తారు. కాని ఇది లాభసాటి కాదు. దూడలను పుట్టగానే లేదా వీలైనంత త్వరగా తల్లినుంచి వేరు చెయ్యాలి.

పశుసంపదగల ప్రతివ్యక్తి దూడల పెంపకంలో ఉన్న కొన్ని ముఖ్యాంశాలను గురించి తెలుసుకోవాలి. దూడ పుట్టకముందే కొన్ని జాగ్రత్తలు తీసుకోవటం చాలా అవసరం.

## దూడ పుట్టకముందు తీసుకోవలసిన జాగ్రత్తలు

దూడ పుట్టకముందే ఎటువంటి రకం దూడకావాలో, అది ఏ జాతిదిగా ఉండాలో నిర్ణయించుకోవాలి. అట్లా కోరుకున్న రీతిగా దూడలను పొందాలంటే ఉత్తమజాతికిచెందిన, ఆరోగ్యకరమైన గేదెనుగాని ఆవునుగాని ఎన్నుకొని, అదేవిధంగా ఉత్తమ లక్షణాలున్న ఆబోతును లేదా దున్నను ఎన్నుకోవాలి. తర్వాత వాటినిదాటించాలి. దాటించినతర్వాత కట్టినఆవును

లేదా గేదెను జాగ్రత్తగా గమనించాలి. ఆహారం కేవలం తల్లికేగాక లోపల పెరిగే దూడకుకూడా సరిపోయేటట్టు ఇవ్వాలి. కట్టుతోఉన్న పశువును మిగతా పశువులకన్న జాగ్రత్తగా చూసుకోవాలి. నెలలు నిండుతున్న సమయంలో పశువు వెనకభాగాన్ని, పొదుగునూ మెల్లగా మర్దన చెయ్యాలి. ఈనటానికి ముందుగా పశువు వెనుకభాగాన్ని, లైంగికావయవాలనూ శుభ్రంగా వేడినీటితో, సబ్బుతో కడగాలి.

## దూడ పుట్టిన తర్వాత తీసుకోవలసిన జాగ్రత్తలు

దూడ పుట్టగానే ముక్కులో, నోటిలోవున్న కఫాన్ని తీసెయ్యాలి. ముందుకాళ్ళను ముందుకు వెనకకు ఆడించాలి. ఒక కుండెడు నీరు దూడపై పోసి తుడిచెయ్యాలి. పై వాటివల్ల ఊపిరి పీల్చడం ప్రారంభం కాకుంటే దూడ ముక్కుపుటాలలోకి గాలి ఊదాలి. ఒకసారి ఊపిరి పీల్చడం జరిగితే ఇక దానంతట అదే పీల్చుకుంటుంది.

దూడ పై భాగాన్ని తల్లి చేత నాకనివ్వాలి. ఒకవేళ నాకకుంటే దూడపైన ఒక చారెడు ఉప్పు చల్లాలి. అప్పటికీ నాకకుంటే దూడను వరిగడ్డితోగాని, తెల్లని గుడ్డతోగాని తుడవాలి.

ఊపిరి పీల్చుకోవడం మొదలుపెట్టిన తర్వాత దూడకు బొడ్డు కోయ్యాలి. బొడ్డును కోసేటప్పుడు దూడ ఒంటికి రెండు, మూడు సెంటీమీటర్ల దూరంలో ముడివేసి ఆ ముడికి కిందగా ఒక సెంటీమీటరు దూరంలో కోయ్యాలి. దూడ ఒంటిమీదున్న ముడికి "అయోడిన్" గాని 'పసుపు'గాని మానిపోయేవరకు వాడాలి.

## దూడల ఆహారం

దూడలకు ఆహారం ఎక్కువగా ఇవ్వగూడదు. ఆహారం ఎక్కువగా అజీర్ణంతోపాటు, కడుపులో ఉండు క్రిములు కూడా పెరిగే అవకాశముంటుంది.

**సాధారణంగా** దూడలను తల్లిపాలతోనే పెంచడం అలవాటు. లేక పోతే మిశ్రమమైన ఆహారమిచ్చి పెంచడం పరిపాటి. ఏ పద్ధతిలో పెంచినా దూడలకు అవసరమైనంత ఆహారాన్ని పెట్టాలి. దూడకు తాజాపాలు గాని, కుడితిగాని పట్టాలి. అచ్చమైన పాలనెప్పుడూ ఇవ్వకూడదు. అచ్చమైన పాలలో సగం నీళ్ళు కలిపి రోజుకు 4, 5 సార్లు పట్టాలి. ఆహారం మార్చదలుచుకుంటే, ఒకేసారి గాక, కాస్త మెల్లమెల్లగా, దినదినం కొద్దికొద్దిగా మార్చాలి. పచ్చిగడ్డి ఇవ్వాలనుకొన్నా, వేరే ఏదైనా ఆహారాన్ని ఇవ్వాలనుకొన్నా, ఇచ్చే ఆహారాన్ని తగ్గించి, కొత్త ఆహారాన్ని చేర్చాలి.

పాలు **దూడల**కు పుష్టికరమైన ఆహారం. దూడల పెరుగుదలకు, రోగ నిరోధకశక్తికి అవసరమైన వస్తువులన్నీ పాలలో లభిస్తాయి. జున్ను పాలలో రోగనిరోధకశక్తికి కావలసిన వస్తువులు ఉంటాయి. ఒకవేళ జున్నుపాలు లభ్యం కాకుంటే ఒక కోడిగుడ్డు, కొంచెం ఆముదం, కొంచెం ఇంగువ, బెల్లం కలిపి 3, 4 రోజులవరకు దూడకివ్వాలి.

**అచ్చమైన** పాలు లభించకుంటే వెన్న తీసిన పాలలో వేరుసెనగ పిండి 2 భాగాలు, తవుడు లేక చిట్టు 2 భాగాలు, బాగా దంచిన జొన్న భాగాలు కలిపి దూడ తీసుకునేవిధంగా తయారుచేసి పెట్టాలి. పాలు గాడా లభించకుంటే, 2 భాగాల వేరుశెనగపిండి, 2 భాగాల తవుడు లేదా గోధుమపొట్టు, 5 భాగాల జొన్న లేదా మొక్కజొన్న లేదా బియ్యం బాగా దంచి 2 భాగాల సెనగపప్పు లేదా కందిపప్పుతో కలిపి గంజిగా తయారుచేసి ఇవ్వాలి. దూడలకు ఎప్పుడూ పోషకపదార్థాలున్న ఆహారాన్నే ఇవ్వాలి. ఆహారంలో పత్తి, అవిసెగింజపిండి ఎక్కువగా కలపకూడదు. బూజుపట్టిన పిండిపదార్థాలు, చెడిపోయిన పాలూ ఇవ్వకూడదు.

## దూడలకు వచ్చే వ్యాధులు

దూడలకు సాధారణంగా కొన్ని అంటువ్యాధులూ, ఉదర సంబంధమైన వ్యాధులు వస్తూంటాయి. అంటువ్యాధులకు టీకాలు వేయించాలి.

ఉదర సంబంధమైన వ్యాధులు, అవి తినే ఆహారంవల్ల సంభవిస్తాయి. ఇవి ప్రాణాపాయం అయినా, కాకున్నా దూడలను చాలా నీరసంచేసి పెరగనీయకుండా చేస్తాయి. సరైన ఆహారం లేకపోవటంవల్లగాని, ఆహారం కావలసినంతగా లభించకపోవటంవల్లగాని, లేదా చెడిపోయిన పాలు వగైరాలు ఇవ్వటంవల్ల, లేదా చలికి, ఎండకు విచ్చలవిడిగా వదిలెయ్యటం వల్ల, రెండుమాసాల వయసులోగల దూడలు మరణించటం సహజం. మురికి గుంటల్లో, కాలవల్లో దొర్లటంవల్ల గూడ వీటికి రోగాలు వచ్చే అవకాశముంది. అందువల్ల చిన్న దూడలను జాగ్రత్తగా సాకాలి.

## రోగనిరోధక పద్ధతులు

దూడలకు టీకాలు వేయడం కన్నా, తల్లికడుపులో ఉన్నప్పుడు ఆ టీకాలు వేయించడం మంచిది. ముఖ్యంగా ప్రాణాపాయం కల్గించే వ్యాధులకు టీకాలు వేయించాలి. దూడలకు జున్నుపాలు లభించేట్టు చూడాలి. జున్నుపాలలో రోగనిరోధక శక్తిని కల్గించే వస్తువులు దూడకు తల్లినుంచి లభిస్తాయి. 4 లేదా 6 మాసాల వయసుగల దూడలకు జబ్బవాపు, ముసరటం మొదలైన వ్యాధులు రాకుండా టీకాలు వేయించాలి.

చిన్న దూడలకు టీకాలు వేయించడం సాధ్యంకాదు. కనక, రోగాలను అరికట్టగల మందులను దూడలకు ఆహారంలో కలిపి ఇవ్వాలి.

దూడలకు నట్టలు మొదలైనవి కడుపులో చేరి జీర్ణ శక్తిని క్షీణింప చేస్తాయి. ఇవి, తల్లినుంచిగాని ఇతర పశువులనుంచిగాని రావచ్చు. అందువల్ల పశువుల డాక్టరు సలహా తీసుకోవాలి. పేను, గోమారి సోకకుండా, డి.డి.టి. లాంటివి శరీరం మీద చల్లాలి.

## దూడలలోని దుర్గుణాలు

దూడలలో సామాన్యంగా మూత్రం త్రాగడం, గోడలు నాకటం, పేడ తినటం, ఇతర పశువులను పొడవటం వంటి దుర్గుణాలుంటాయి. ఒక దూడ ఇంకో దూడను నాకటంవల్ల, దాని వెంట్రుకలు కడుపులోకి వెళ్ళి బంతిగా తయారవుతుంది. ఇతర వ్యాధులు కూడా వచ్చే అవకాశముంది. ఎముకలను కొరకడం, ఇనపముక్కలను కొరకడంవల్ల అనేక ప్రమాదాలున్నాయి. కాబట్టి దూడల కంపుబాటులో అనవసరమైన వస్తువులను ఉంచగూడదు. పొడిచే దూడల కొమ్ములను 10 వ రోజునే కొమ్ములు పెరగకుండా కాల్చాలి.

# పాల ఉత్పత్తి

| | | |
|---|---|---|
| ఉత్పత్తి | స్వచ్ఛమైన | సూక్ష్మజీవులు |
| ఆస్కారం | ప్రత్యేకమైన | సంతృప్తి |
| సంపూర్ణ | | |

ఆరోగ్యంగా ఉన్న పశువుల పొదుగునుంచి తీసే పాలు, శుభ్రంగా ఉంటాయి. ఇతర మలినపదార్థాలు కలిస్తే పాలు విరిగిపోతాయి. ఈ మలినపదార్థాల ద్వారా అనేక సూక్ష్మజీవులు (క్రిములు) పాలలో చేరి వాటి గుణాలను చెడగొడతాయి. అలా నాణ్యత తగ్గిన పాలు, మనకు అనారోగ్యాన్ని కలిగించటమేగాక, ఎక్కువకాలం నిలువచేయటానికి వీలుగా ఉండవు. అమ్మకపు ధరకూడా తగ్గిపోతుంది.

## పరిశుభ్రమైన పాలెందుకు ?

మనిషి ఆరోగ్యాన్ని రక్షించే శక్తి, సత్తువ పెంచే గుణం, పరిశుద్ధమైన పాలలోనే ఉంది. పాలు ఎక్కువకాలం చెడకుండా ఉంటేనే దూర ప్రదేశాలకు పంపే అవకాశం, ఎక్కువధరకు అమ్మే ఆస్కారం ఉంటుంది. పరిశుభ్రమైన పాలతో తయారుచేసిన వెన్న, నెయ్యి మొదలైన పదార్థాలు మంచి రుచి, వాసనలు కలిగి ఉంటాయి. వీటిని ఎక్కువ కాలం నిలువచేయటానికి వీలవుతుంది. పరిశుభ్ర పరిసరాలలో, పరిశుభ్రమైన పాత్రలలో పాలను సేకరించటం అవసరం.

## పరిశుభ్రమైన పాలను ఉత్పత్తిచేయటం ఎలా ?

మన గ్రామాల్లో పాడి పశువులను పెట్టుకొని పాలను ఉత్పత్తిచేసే వారు ముఖ్యంగా ఈ కింది నియమాలను పాటిస్తే పాల పరిశుభ్రతను కాపాడవచ్చు.

## ఆరోగ్యమైన, పరిశుభ్రమైన పశువు

పశువుల ఆరోగ్యాన్ని కాపాడాలి. అంటువ్యాధివల్ల బాధపడే పశువులను వేరుచెయ్యాలి. అంటువ్యాధి సోకిన ఏ ఒక్క పశువు మందలో ఉన్నా, ఇతర పశువులకు కూడా ఆ వ్యాధి సోకటం తథ్యం. అటువంటి, ప్రమాదాలను అరికట్టటానికి, పశువుల ఆరోగ్యాన్ని కాపాడటానికి, వ్యాధి నివారణకు దగ్గరలోని పశువుల డాక్టరు సలహా తీసుకోవాలి.

## ఆరోగ్యకరమైన పశువే మంచి పాలనిస్తుంది

పశువులను బురద నీటిలోకి, మడుగులలోకి చేరకుండా చూడాలి. పాలను పితికే ముందు పొదుగును శుభ్రంగా కడగాలి. పాడిపశువుల తొడలమధ్య ఉండే వెంట్రుకలను కత్తిరించాలి.

## శుభ్రమైప పాత్రలు

పరిశుభ్రమైన పాత్రలలోనే పాలను పితకాలి. సొట్టపోయిన, తుప్పుపట్టిన పాత్రలను వాడకూడదు. కళాయి చేయించిన పాత్రలు పాలు పితకటానికి మంచివి. వంటగదిలోని పాత్రలలో పాలుపితికే పాత్రలను ఉంచకూడదు.

## పాల పాత్రలను పరిశుభ్రంచేసే పద్ధతి

పాల పాత్రను మంచినీళ్ళతో కడిగి వేడినీటిలో ముంచాలి. తర వాత క్లోరిన్‌వంటి క్రిమినాశక ద్రవం గోరువెచ్చటి నీటిలో కలిపి పాత్రను కడగాలి. పాత్రను పైవిధంగా శుభ్రపరిచిన తర్వాత తడి ఆరిపోవటానికి పాత్రను శుభ్రమైన చోట బోర్లించి పెట్టాలి. ఈ వివరాలు మనం పాల సేకరణ కేంద్రాల ద్వారా విపులంగా తెలుసుకోవచ్చు.

ఒకవేళ సంపూర్ణ సమాచారం దొరక్కపోతే ఈ కింది సులభ పద్ధతో పాల పాత్రలను శుభ్రం చెయ్యాలి.

వల్ల పశువుల పాకను ఎప్పుడూ శుభ్రంగా ఉంచాలి. అడపా దడపా డి.డి.టి. చల్లితే ఈగల బెడద ఉండదు.

పాల పాత్రను కూడా మూతలేకుండా ఎప్పుడూ ఉంచకూడదు.

## పాలు పితికే మనిషి

పాలు పితికే మనిషి ఆరోగ్యంగా, పరిశుభ్రంగా ఉండటంముఖ్యం. గజ్జి, దగ్గు, జలుబు, పగిలిన కురుపులు గల చేతులు, వేళ్ళు ఉండకూడదు.

పాలు పితికే ముందు, చేతులను శుభ్రంగా కడిగి గుడ్డతో తుడుచుకోవాలి. తడిచేతులతో పాలు పితకకూడదు. పెరిగిన గోళ్ళు, మురికి గుడ్డలు, పాలు పితికే మనిషికి ఉండకూడదు.

పొదుగు నాలుగుచన్నుల నుండి రెండు మూడు ధారలను మొదట ఒక గిన్నెలోకి పితకాలి. ఈ మొదటి ధారలలోని పాలలో సూక్ష్మజీవులు అధికంగా ఉంటాయి. అందువల్ల ఈ పాలను మిగతాపాలతో కలపకూడదు.

పితికిన పాలను శుభ్రమైన గుడ్డతో వడబోసి పాల పాత్రలో పొయ్యాలి. వడబోత గుడ్డను శుభ్రంగా ఉతికి ఎండలో ఆరెయ్యాలి.

అన్ని విషయాలనూ కాస్త జాగ్రత్తగా పాటిస్తే శుభ్రమైన పాలు సులభంగా పొందవచ్చు.

పైన చెప్పిన విధానాలను అనుసరిస్తే సంతృప్తికరమైన ఫలితాలను పాలవల్ల పొందవచ్చు.

పరిశుభ్రమైన పద్ధతిలో స్వచ్ఛమైన పాలను పొందటానికి ఇంకే విధమైన సలహాలు, సహాయాలు కావాలన్నా, మీ గ్రామ సేవకుని సంప్రదించండి.

# లాభసాటిగా గొర్రెల పెంపకం

సీనప్పది సీతానగరం. సీతానగరం పట్నానికి పదిమైళ్ళలో ఉన్న పల్లెటూరు. సీనప్పకు చిన్ననాటి స్నేహితుడైన రామప్పదగ్గరినుంచి ఆరోజే ఉత్తరం వచ్చింది. ఉత్తరంతోబాటు రామప్ప పెళ్ళి శుభలేఖకూడా ఉంది. రామప్పది రాంపురం. రాంపురం కూడ పల్లెటూరే. సీతానగరానికి 20 మైళ్ళుంటుంది రాంపురం. పట్నానికి చాలాదూరం. రెండూ మెట్ట ప్రాంతాలే. పట్నంలో రామప్ప, సీనప్ప 6 నుండి 10 తరగతులదాకా కలిసి చదువుకున్నారు. ఇదంతా అయిదేళ్ళ కిందట. ఎందుకంటే రాంపురంలోగాని, సీతానగరంలోగాని హైస్కూలు లేదు. అక్కడ అయిదో తరగతిదాకానే ఉంది. అయిదేళ్ళ క్రితం పదోతరగతి అయిపోయినాక, రామప్ప చదువు మానేసి ఇంటికి వెళ్ళిపోయాడు. ఎందుకంటే వారి ఆర్థికస్థితి అంత బాగాలేదు. పై చదువులు చెప్పించే స్తోమత లేదు తండ్రికి. సీనప్ప యీ అయిదేళ్ళలో పై చదువులు చదివి ఈ ఏడే బి.ఏ. కూడా పూర్తిచేశాడు. మిత్రులిద్దరూ అప్పుడప్పుడూ ఉత్తరాలు రాసుకోవటమే గాని అయిదేళ్ళుగా మళ్ళీ కలుసుకోలేకపోయారు.

పెళ్ళిరోజుకల్లా సీనప్ప రామప్ప ఊరికివెళ్ళాడు. రామప్ప పెళ్ళి బాగా జరిగింది. బాల్యమిత్రుడు వచ్చినందుకు రామప్ప ఎంతో మురిసిపోయాడు. పెళ్ళికూతురుది కూడా ఆ ఊరే. రామప్పకు మేనమామ కూతురే!

రామప్ప బలవంతంమీద సీనప్ప మరో రెండు రోజులున్నాడు రాంపురంలో. ఒకరోజు భోజన సమయంలో సీనప్ప, రామప్పతో ఇట్లా అన్నాడు.

"మనం కలిసి చదువుకునే రోజుల్లో మీ యింట్లో గొర్రెలు లేవు. ఇప్పుడు 50, 60 దాకా ఉన్నాయి. రైతుకు గొర్రెలెందుకురా రామప్పా?"

రామప్ప:- "వ్యాపారం చేయటానికి"

సీనప్ప:- "వ్యాపారమా? నువ్వా? గొర్రెల వ్యాపార మేమిట్రా?"

రామప్ప:- "అవునురా! వ్యాపారమే. వీటపై ఏటా నేను ఎంత డబ్బు సంపాదిస్తున్నానో తెలుసా?"

సీనప్ప:- నవ్వుతూ, "ఎంతేమిటి?"

రామప్ప:- "ఏటా అయిదువేల రూపాయలు వస్తాయి. నా పెళ్ళికి ముందే పాతిక గొర్రెలు అమ్మాను. అయిదున్నర వేలు వచ్చాయి."

సీనప్ప;- "కొంచెం వివరంగా చెప్పరా బాబూ!"

రామప్ప:- "మా ఇంటి ఆర్థిక పరిస్థితి బాగాలేకనే నేను 10 వ తరగతి తర్వాత చదువు మానేశావా! అది నీకు తెలుసుకదా! ఆ తర్వాత అనుకోకుండా బ్లాకు పశు విస్తరణాధికారితో పరిచయం కలిగింది. ఆయన సలహో, సహాయంతో ఈ పరిశ్రమ పెట్టాను. మనకు మంచి రాబడి తెచ్చేది ఏదైనా పరిశ్రమ కిందే లెక్క. మనవి మెట్టప్రాంతాలు. ఇక్కడ వర్షం తక్కువ. పంటలూ తక్కువే. పండిన మెట్టపంటలు తిండికీ, గుడ్డకూ చాలవు. అందుకని పది గొర్రెలతో అయిదేళ్ళ కిందట గొర్రెల పెంపకం మొదలుపెట్టాను. క్రమంగా అభివృద్ధి చేశాను. మన రాష్ట్రింలో నెల్లూరు, దక్కని, మాండియా జాతుల గొర్రెలున్నాయి. ఒక్కొక్క జిల్లాలో ఒక్కొక్కరకం పెంచుతారు. గొర్రెలు సాధారణంగా 10 నుంచి 12 సంవత్సరాల వయసు వరకు జీవిస్తాయి. ఆడగొర్రెలు 9-14 నెలల వయసులో ఎదకొచ్చి కడతాయి. సాధారణంగా ఒక్కొక్క ఈతకు ఒక్కపిల్లే పుడుతుంది. కొన్ని రెండు పిల్లలను కూడ పెడతాయి. వయ

స్సులో గొర్రె 5-6 ఈతలీనుతుంది. 4-8 సంవత్సరాల వయస్సు లోని గొర్రెలను మాంసంకోసం అమ్మెయ్యాలి. ఒక గొర్రెకు 30-40 కిలోల మాంసం వస్తుంది. ఒక్కొక్క గొర్రెకు 250 రూపాయలపైననే ధర పలుకుతుంది. గొర్రె పుష్టిగా ఉంటే రూ. 300 దాకా ధర వస్తుంది. మగగొర్రెపిల్లల్ని 4 నెలల వయస్సు రాగానే విడదీసి ఆరునెల్ల వయస్సు దాటిన తర్వాత అమ్మాలి. మంచి ధర వస్తుంది."

సీనప్ప:- "గొర్రె ఎన్ని రోజులకు ఈనుతుంది? వీటిని మేపటం అదీ ఎట్లా చేస్తున్నావు?"

రామప్ప:- "గొర్రె ఎదకొచ్చిన తర్వాత ఎద సుమారు 27 గంటల కాల ముంటుంది. చూడి అయిన తర్వాత అంటే కట్టిన తర్వాత నాలుగున్నర నెలలనుండి అయిదు నెలలకు గొర్రె ఈనుతుంది. ప్రతి మందలోనూ ఒక విత్తనంపోతు ఉండాలి. మంచిజాతి విత్తనం పోతును మందలో ఉంచటం చాలా అవసరం. గొర్రెల బలం, బరువు, ఆరోగ్యం, మాంసం, ఉన్ని మొదలయిన వాటి దిగుబడి విత్తనం పొట్టేలుమీద ఆధారపడి ఉంటాయి. విత్తనం పొట్టేలు వయసు 3-8 ఏళ్ళ మధ్య ఉండాలి. 8 ఏండ్లు దాటిన పోతును అమ్మివేయాలి."

సీనప్ప:- "గొర్రెలకు ఎలాంటి ఆహారం ఇవ్వాలి?"

రామప్ప:- "మెట్టప్రాంతం పచ్చిక, కలుపు ఆకులు, చేలగట్లమీద ఉండే గడ్డి వీటి ముఖ్య ఆహారం. రాళ్ళు, గుట్టలలో కూడా ఇది గడ్డి మేస్తుంది. ఇవిగాక తుమ్మచెట్ల ఆకులు, కాయలు, రావిచెట్ల ఆకులు కూడా ఇవి తింటాయి. కాని నిండుచూలు గొర్రెలకు

మన స్థితినిబట్టి ఉలవలు, సెనగ నూక, వేరుశనగపిండి, తవుడు మొదలయినవి అన్నీ కలిపిన దాణా రోజుకు ఒక్కొక్కదానికి అర కిలో చొప్పున పెడితే మంచిది. అంతేకాక పచ్చి జనుము, పిల్లి పెసర, లూసరన్, బర్సమ్ వంటి పచ్చిగడ్డి ఎండుగడ్డితో కలిపి ఇవ్వాలి. ఇది చాలా బలమైన ఆహారం. గొర్రెపెంట చేలకు మంచి బలాన్నిస్తుంది."

సీనప్ప:- "మరి వీటికి రోగాలు వస్తే ఏం చేస్తున్నావు?"

రామప్ప:- "గొర్రెలకు అంటువ్యాధులు, సాధారణ వ్యాధులని రెండు రకాలు. అంటువ్యాధులలో చిటకాలు, రక్తదొమ్మ, గొంతువాపు, ముసర లేదా చీడపారు హానికరమైనవి. ఇవి తొలకరి వానల తర్వాత వస్తాయి. ఈ వ్యాధులు అసలు రాకుండా చేయొచ్చు. దానికి టీకాలు వేస్తారు. ఎందుకంటే ఈ అంటువ్యాధులు వస్తే కష్టం. ఒక్క గొర్రె చచ్చిపోయినా సుమారు 800 రూపాయలు నష్టపోతాం. మా ఊరికి రెండు మైళ్ళలో పశువుల ఆసుపత్రి ఉపకేంద్రం ఉన్నది. అక్కడుండే ఇనస్పెక్టర్ మంచివాడు. గొర్రెలకు టీకాలు వేసి కావలసిన సలహాలిస్తుంటాడు. అసలు ఏడాది రెండేళ్ళు పోతే మనకే చాలావరకు తెలుస్తాయి, ఎప్పుడేం చేయాలో."

సీనప్ప:- "ఇక సాధారణ వ్యాధులేమిటి వీటికి?"

రామప్ప:- "జెలగరోగం, అన్నకోశం లోపల పుండు,పురుగులుపట్టడానికి కారణమయేరోగాలు.చాలా ప్రమాదకరమైనవి.ఈవ్యాధులవల్ల రక్తం, చీము కలిసిన విరేచనాలు, కడుపునొప్పి కలుగుతాయి.

రక్తం తీసేసి గొర్రెలు నీరసించి చనిపోతాయి. గొర్రెల్లో పై వ్యాధి లక్షణాలు కనిపించిన వెంటనే పశువైద్యులకు చూపెట్టి నివారించాలి."

సీనప్ప:— "ఒరే, ఏం అనుకోకు ఇట్లా అంటున్నందుకు. నీకీపనిచేయటంలో ఏమీ చిన్నతనం అనిపించటం లేదా ? పైగా ఇది మనవృత్తి కాదుకదా ?"

రామప్ప:— "ఇప్పుడు నీవేంచేస్తున్నావు ?"

సీనప్ప :— "బి.ఎ. పాసైన తర్వాత ఖాళీగానే ఉంటున్నాను. ఉద్యోగ ప్రయత్నం చేస్తున్నాను. ఉద్యోగం మాత్రం దొరికే సూచనలు కనపడ్డంలేదు."

రామప్ప:—"ఒరేయ్ బి.ఎ. ప్యాసై ఇంకా అమ్మా, నాన్నలు సంపాదిస్తే తింటున్నావు కదా ! రేపు ఉద్యోగంవస్తే నీవు ఎలాగూ ఒకరి కింద పని చెయ్యాలి. నీవు రేపు ఉద్యోగంలో చేరిన తర్వాత చేసేపని నీవృత్తి కాదు. నీ తల్లిదండ్రులు చేసేది కాదు. అంటే సరైన పద్ధతుల్లో సంపాదిస్తే ఏ వృత్తి అయినా మంచిదే. ఇక నేను చేసే పనిగురించి నేను స్వతంత్రుణ్ణి. ఎవరి కిందా పని చేయటంలేదు. నీవు ఉద్యోగంలో చేరినా ఏడాదికి, అయిదారు వేలు సంపాదించటం కష్టమే ! ఇకపోతే మనం ఒక విషయం గుర్తుంచుకోవాలి. ఈ వాడు మాంసం అంగళ్ళలో మంచి మాంసం దొరకటంలేదు. మాంసానికి మంచిగిరాకీ ఉంది. నీవు ఎప్పుడంటే అప్పుడు అమ్మెయ్యవచ్చు. నేను మూడువేల

రూపాయలతో ఇది మొదలుపెట్టాను. ఇప్పుడు ఏటా అయిదు వేల రూపాయలు సంపాదిస్తున్నాను. నేను కూడా వాటి ఆలనాపాలనా చూస్తాను. పనివాళ్ళు కూడా ఉంటారు. పట్నంలో నీకంటే ఎక్కువ చదివిన వాళ్ళు పెద్దపెద్ద ఇస్త్రీ షాపులు నడుపుతున్నారు. మరి వృత్తి గురించి చిన్నతనం ఏమిటిరా నీ పిచ్చిగాని."

సీనప్ప:— "నీవు చెప్పేది నిజంరా! ఈ ఉద్యోగాలకు పడిగాపులుపడేకంటే నీలాగ స్వతంత్ర జీవనం గడపడమే హాయిరా."

రామప్ప:—"చాలా సంతోషం. శుభస్య శీఘ్రం."

---

# ఎలుకలు - వాటి నిర్మూలన

ఎలుకలవల్ల మనం ఎంతో నష్టపోతున్నాం. మన ఇండ్లలోని ధాన్యం, పప్పులు, కాయగూరలు ఎలుకలవల్ల నష్టమవుతున్నాయి. వరి, గోధుమ, వేరుశనగ, కొబ్బరితోటలు, దుంపజాతిపైర్లు, పండ్ల తోటలకు అపారనష్టం కలుగుతుంది.

మనదేశ జనాభా 80 కోట్లదాకా ఉంది. ఎలుకల సంఖ్య మన జనాభాకు నాలుగు రెట్లుందని అంచనా. ఎలుకలు తినే ఆహారం, మనకు కలుగుతున్న ఆహారధాన్యాల అపార నష్టాన్ని గమనించి వీటి సంఖ్యను అంచనా వేయటం జరిగింది.

ఎలుకలు అతి త్వరగా సంతానోత్పత్తి చేస్తాయి. సంవత్సరంలో ఒక ఆడ ఎలుక 5 నుంచి 7 సార్లదాకా ఈనుతుంది. ఒక్కొక్క ఈతలో 8 నుంచి 10 పిల్లల దాకా ఈనుతుంది. ఈ పుట్టిన పిల్లలు కూడా రెండు మూడు నెలల్లోనే చూడి అయి ఈనుతాయి. దీనినిబట్టి ఎలుకలు ఎంత త్వరగా వృద్ధి అవుతాయో మనకు అర్థమవుతుంది. ఎలుకలలో 110 జాతులున్నాయి.

ఎలుకలు తిండి విపరీతంగా తింటాయి. ఒక్కరోజులో నాలుగు ఎలుకలు మామూలుగా ఒక్కమనిషి ఒకరోజు తినేంత ఆహారాన్ని తింటాయి. అంటే వంద ఎలుకలు ఒక సంవత్సరంలో సుమారుగా 12 బస్తాల ఆహార ధాన్యాలను తింటాయి. అంతేగాక అవి తినే ఆహారానికి పదిరెట్ల ఆహారాన్ని వాటి మల మూత్రాలతో, వెంట్రుకలలో కలుషితం చేస్తాయి. ఇట్లా కలుషితమైన ఆహారపదార్థాలు మనం తిన్నప్పుడు మన

ఆరోగ్యం పాడవుతుంది. అంతేకాక ఎలుకలు రోగక్రిములను ఒకచోటు నుండి మరొక చోటుకు చేర వేయటంద్వారా అంటు వ్యాధులను కూడా వ్యాపింపజేస్తాయి.

ఎలుకలవల్ల మనకు జరుగుతున్న నష్టం అపారమని మనకు తెలుసు. వీటిని అరికట్టటానికి రెండు పద్ధతులను పాటించాలి, 1. నివారణ, 2. నిర్మూలన. ఎలుకలు మన ఇళ్ళలోకే కాకుండా పొలాల్లోకి గూడా చొరబడకుండా నివారించటానికి కట్టుదిట్టాలు చెయ్యాలి.

ఎలుకలను నిర్మూలించటానికి బోనులను ఉపయోగించటం, విషపూరితమైన ఎరలను పెట్టటం, ఎలుకలకన్నాలలో పొగబారించటంలాంటి పద్ధతులు ముఖ్యంగా అనుసరించదగ్గవి. బోనులలో ఉంచే ఎరకు వంటనూనె కూడా కలపటం మంచిది. ఎలుకలను చంపటానికి జింక్ ఫాస్ఫైట్, వార్ ఫరిన్ వంటి రసాయనాలను విషపదార్థాలుగా వాడొచ్చు. ఇంట్లో పిల్లలు ఈ విషపదార్థాలు ముట్టుకోకుండా జాగ్రత్తపడాలి. ఈ విషపదార్థాలు మనంతినే ఆహారపదార్థాల్లో కలవకుండా కూడా జాగ్రత్తపడాలి.

# దరఖాస్తు ఫారాలు

| | | |
|---|---|---|
| వ్యవసాయాభివృద్ధి | స్వాధీనం | అచ్చుఫారం |
| బ్యాంకు | శిస్తు | దరఖాస్తు |
| సెక్రటరీ | రికార్డు | నకళ్ళు |
| రిజిష్టర్ | యాజమాన్యం | విక్రయదస్తావేజు |

పెద్దలకు చదువుచెప్పే ఊరిచావడిలో ఆ రోజు వ్యవసాయాభివృద్ధి బ్యాంకు అధ్యక్షుడు మాట్లాడాడు. చిన్న కమతాలు గలవారికి బావికి, పంపుసెట్లకు బ్యాంకు తక్కువ వడ్డీమీద అప్పులిస్తుందని చెప్పారు. సోమయ్య నాలుగెకరాల రైతు. బావి పూడిక తీయించి, ఇంజను పెట్టాలనుకున్నాడు. కాని డబ్బు లేదు. మీటింగు తర్వాత సోమయ్య బ్యాంకు అధ్యక్షుని కలిసి తన అవసరం చెప్పుకున్నాడు. అధ్యక్షుడు మర్నాడు సోమయ్యను బ్యాంకుకు రమ్మన్నాడు.

మర్నాడు సోమయ్య బ్యాంకు కెళ్ళాడు. అధ్యక్షుడుబ్యాంకుసెక్రటరీని పిలిచి సోమయ్యకు అప్పు ఇవ్వాలి అని చెప్పి అవసరమైన కాగితాలు పూర్తి చేయించమన్నాడు.

సెక్రటరీ మంచివాడు. సోమయ్యను తనగదికి తీసికెళ్ళాడు. అవసరాలు విన్నాడు.

సెక్రటరీ:- "సోమయ్యగారూ! ఈ భూమి మీ పేరనే ఉన్నదా ?"

సోమయ్య:- "రెండెకరాలు 6 సంవత్సరాల క్రితం, 2 ఎకరాలు మూడు సంవత్సరాల క్రితం కొన్నాను. కాగితం నాపేరనే రాయించుకున్నాను."

సెక్రటరీ:- "రిజిష్టర్ చేయించుకోలేదా?"

సోమయ్య:- "లేదు."

సెక్రటరీ:- "ఎందుకని?"

సోమయ్య:- "భూమి స్వాధీనం అయింది. కాగితం రాయించుకున్నాం కదా! తర్వాత రిజిష్టర్ చేయించుకోవచ్చులే అనుకున్నాను. ఆనుకు పోవటానికి తీరిక, సమయం, డబ్బు లేక రిజిష్టర్ చేయించుకోలేదు."

సెక్రటరీ:- "మరి భూమి మీ పేరుమీద లేనిదే అప్పు దొరకదు కదా!"

సోమయ్య:- "భూమినాది. కాగితాలు ఉన్నాయి. శిస్తు నేనే కడుతున్నాను. కావలిస్తే చూసుకోండి!" అని ఆ కాగితాలన్నీ సెక్రటరీ కిచ్చాడు.

సెక్రటరీ:- ఆ కాగితాలన్నీ చూసి చిరునవ్వుతో, "అదికాదు సోమయ్యగారూ! ప్రభుత్వ రికార్డులో ఆ భూమి మీ పేర లేదు. అందుకని అప్పు దొరకదు. మేము ప్రభుత్వంవారు చెప్పినట్లు చేసేవాళ్ళమే గాని మా ఇష్టం వచ్చినట్లు చేయలేము కదా!"

సోమయ్య:- "మరిప్పుడేం చెయ్యాలి?"

సెక్రటరీ:- కొంచెంసేపు ఆలోచించి, "భూములపై యాజమాన్యం హక్కులను ప్రభుత్వం ఇప్పుడు రికార్డుచేస్తున్నది. మీకు ఖర్చులేకుండా పని జరుగుతుంది. కరణం/పట్వారిదగ్గర లేదా తహసీల్ ఆఫీసులో తెలుగులో ఒక అచ్చుఫారం దొరుకుతుంది. ఆదరఖాస్తు ఫారం నింపి, శిస్తు రసీదుల నకళ్ళు, మీరు కొన్నప్పుడు రాయించుకున్న విక్రయ దస్తావేజు నకళ్ళు జతపరచి తహసీల్దారుకు ఇవ్వండి. వారు మీ దరఖాస్తును పరిశీలించి, మీ ఊరికి వచ్చి విచారించి, మీ పేర భూమిపట్టా మారుస్తారు."

సోమయ్య:- "ఇది జరగనిదే అప్పు దొరకదా!"

సెక్రటరీ :- "అప్పు మీకు ఇవ్వాలనే అధ్యక్షులవారు కూడా చెప్పారు. మాకు కూడా ఇవ్వాలనే ఉంది. మీరది పూర్తి చేయించండి. వెంటనే అప్పు ఇస్తాం."

సోమయ్య:- "అంటే, అంతవరకు ఆగాల్సిందేనా?"

సెక్రటరీ :- "తప్పదు సోమయ్యగారూ! అంతేకాదు, మీరు ఎప్పుడైనా మీ ఊళ్ళో, ఎవరి దగ్గరైనా, అప్పు తీసుకుంటే, అప్పు పత్రం రాసి ఇవ్వాలి. దాని నమూనాకూడా మీకు ఇప్పిస్తాను. సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థవారు కూడా మీకు అప్పులో నాలుగోవంతు సహాయం చేస్తారు. ఆ ఫారాల నమూనాలు కూడా ఇప్పిస్తాను. అవసరమైనప్పుడు వాడుకోండి."

సోమయ్య:- "మంచిది సెక్రటరీగారూ! భూమిపట్టా త్వరగా నా పేర మార్పించుకొని, కలుస్తాను."

సెక్రటరీ :- "తప్పకుండా."

# తహసిల్దారు గారికి (R.O.R.)

తాలూకా ( సూర్యాపేట )

విషయం : భూములమీద యాజమాన్య హక్కులను రికార్డు చేయించటం గురించి.

R. O. R. రూల్ (5) (2) భూమి చట్టం 1978 కింద ఫారం II

గ్రామంలో ది. 1978 న ప్రచురించినది. ఆ నోటీసును పురస్కరించుకొని నేను

తండ్రి

గ్రామ నివాసిని [ హల్క సూర్యాపేట తాలూకా] తెలుపుకొనేది

ఏమిటంటే కింద రాసిన వివరాలుగల భూమి నా స్వాధీన హక్కు భుక్తాలలో ఉన్నందువల్ల భూమి యాజమాన్యపు హక్కుల రికార్డులలో నా పేర నమోదు చేయమని కోరుతున్నాను.

| గ్రామం | సర్వే నెంబరు | య. గుం. | తరి లేదా ఖుష్కి | హక్కుల వివరం |
|---|---|---|---|---|

తేది

దరఖాస్తుదారు సంతకం లేదా
వేలిముద్ర

G. No. /78

Office of the Tahsildar,
Suryapet. D/ 78

## FORM - VI

(See Rule - 8)

Under Sec. 4 of the A.P. Record of Rights in Land Act, 1971, the undersigned hereby acknowledges the receipt of the intimation of the acquisition of rights from

Sri S/o

R/o in respect of the entry in the record of rights pertaining

to S. Nos.

in the villages of Suryapet Tq.

and Nalgonda district

Dy. Tahsildar. (R.O.R.)
Suryapet.

# ప్రామిసరి నోటు

తండ్రి పేరు వృత్తి

గ్రామం తాలూకా జిల్లా వారికి

తండ్రి పేరు

గ్రామం తాలూకా జిల్లా వారు రాసి

యిచ్చిన ప్రామిసరి నోటు ఏమంటే రూ. [ ] అక్షరాల

రూపాయలు మీ వద్ద నూటికి నెల 1 కి [ ] వడ్డీతో అప్పుగా తీసుకొన్నాను. మీరు కోరినప్పుడు మీకు గాని మీ అనుమతి పొందినవారికి గాని అసలు వడ్డీలతో మొత్తం రూపాయలు చెల్లించి ఈ ప్రామిసరి నోటుపై చెల్లు రాయించుకొని వాపసు తీసుకోగలను. ఇందుకుగాను ఈ ప్రామిసరినోటు మీకు సమయానుకూలంగా అక్కరకు వచ్చే నిమిత్తం రాసి ఇవ్వడమైంది.

రూ.__________

నామ సంIIర వారం

తేది 19 సంIIర

ఇందుకు సాక్షులు:

౧

౨



# రసీదు

తండ్రి పేరు వృత్తి

గ్రామం తాలూకా జిల్లా గారికి

తండ్రి పేరు

గ్రామం తాలూకా జిల్లా వారు రాసి

ఇచ్చిన రశీదు ఏమిటంటే రూ॥[ ] అక్షరాల

రూపాయలు నామ సం॥ర

తేది 19 సం॥ వారం తాలూకు

ప్రామిసరి నోటు రూపాయలు[ ] మీదగ్గరినుంచి ముట్టాయి. ఇందుకుగాను

ఈ రసీదు రాసి ఇవ్వడమైంది.

**రూ.**__________

నామ సం॥ర వారం

తేది 19 సం॥ర

ఇందుకు సాక్షులు :



౧

౨

# సన్నకారు రైతుల అభివృద్ధి పథకం

## దరఖాస్తు ఫారం

రిజిష్టరు నెం.

1. రైతు పేరు

2. తండ్రి పేరు

3. గ్రామం

4. తాలూకా

5 కుటుంబ సభ్యుల సంఖ్య

6. ఖాతా నెం.
లేకపోతే కారణము

| పట్టేదారుగా | | | | | | | | | కౌలుదారుగా | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 7 గ్రామము | 8 ఖుష్కీ | | 9 తరి | | | | | | 10 గ్రామము | 11 ఖుష్కీ | | 12 తరి | | | | | |
| | | | కాలువ | | చెరువు | | బావి | | | | | కాలవ | | చెరువు | | బావి | |
| | స. నెం. | విస్తీర్ణం | స. నెం. | విస్తీర్ణం | స. నెం. | విస్తీర్ణం | స. నెం. | విస్తీర్ణం | | స. నెం. | విస్తీర్ణం | స. నెం. | విస్తీర్ణం | స. నెం. | విస్తీర్ణం | స. నెం. | విస్తీర్ణం |
| | | ఎ.గు. | | ఎ.గు. | | ఎ గు. | | ఎ.గు. | | | ఎ.గు. | | ఎ.గు. | | ఎ గు. | | ఎ.గు. |

| మొత్తం | 13 ఖుష్కి | 14 తరి | 15 ఖుష్కి లెక్కలలోని (1 ఎ. తరి=2 ఎ.ల ఖుష్కి) | 16 మొత్తం ఖుష్కి లెక్కలలో 13+15 |
|---|---|---|---|---|
| | ఎ. గు. | ఎ. గు. | ఎ. గు. | |

| | | (i) ఖా. నెం. | (ii) స. నెం. | (iii) తరి | (iv) ఖుష్కి | (v) మొత్తం ఖుష్కి లెక్కలలో |
|---|---|---|---|---|---|---|
| 17. తండ్రి/తల్లి/సోదరులు/భార్య ఖాతాలోని భూముల వివరాలు. | | | | | | |
| 18. కా. 17 నుండి దరఖాస్తుదారుకు సంక్రమించే భూమి వివరాలు. | | | | | | |
| 19. స్వాధీనములో ఉన్న ఇతర భూముల వివరాలు. | a. సర్కారి | | | | | |
| | b. ఇతరం | | | | | |

20. కా. 16 18 (v) + 19 a (v) 19 (b) (v)

21. వ్యవసాయంవల్ల సాలీనా ఆదాయం

22. వ్యవసాయేతర ఆదాయం
పూర్తి వివరాలు

23. సహకార సంఘ సభ్యుడా? వరపతి సంఘం/భూమితనఖా బ్యాంకు/పాలసంఘం
సభ్యత్వపు నెంబరు

24. పొందిన అప్పు వివరాలు

25. తనఖా వివరాలు

26. వ్యవసాయ పనిముట్లు
పశుసంపద వివరాలు

27. దరఖాస్తుదారు అవసరాలు

దరఖాస్తుదారు సంతకం
తేది.................

పట్వారి సంతకం

తహసీల్దార్
బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసర్

## FOR OFFICE USE ONLY

28. **Remarks & Recommendation of the Inspecting Officer**

29. **Financing Agency to which Recommended**

**Project Officer**
**SFs, MFs, & ALs, D.A. Nalgonda**

జాయింటుదరఖాస్తు అయితే ఇతర ఖాతాదార్ల సంతకాలు.

## నెం. 3 పహాణి పత్రిక

గ్రామం : తాలూకా : జిల్లా :

| బందోబస్తు రికార్డు | | | | | హక్కుల రికార్డు | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | విస్తీర్ణము | | | | సేత్వారు ప్రకారం పారకపు వివరాలు | | | | | | | | |
| ఖాతా నెంబరు | సర్వే నెంబరు పోటు హిస్సా చేను పేరు పట్టా లేదా ఇనాం భూమి | మొత్తం | పోతు ఖరాబు | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | ఖబ్జాదారు పేరు, తండ్రి పేరు, నివాస స్థలం | [illegible] | [illegible] | [illegible] | [illegible] |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 |
| | | | | | | | | | | | | | | |

సం. 197

| సేద్యం వివరాలు | | కౌలు | | వ్యవసాయ శాఖ వివరాలు | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | భూమి ఉపయోగం | | | | విత్తిన భూమి విస్తీర్ణం | | | | |
| వాస్తవంగా సాగుచేసేవాని పేరు, తండ్రిపేరు, నివాసం | అతడు సేద్యంచేసే విధానం | కౌలుకిచ్చే భూమివిస్తీర్ణం | ఏర్పాటయిన కౌలు రకం | ప్రకారం | విస్తీర్ణం | తతిమ్మా విత్తిన భూమి విస్తీర్ణం | పైరు పేరు | అమిశ్రమం | మిశ్రమం | మొత్తం | 26 ఖానాలో చూపిన విస్తీర్ణంలో పారకం అయిన విస్తీర్ణం | పంటల రాబడి పైసలలో |
| 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 |
| | | | | | | | | | | | | |

# మెట్ట సాగు

చంద్రయ్యూది చందుపట్ల. చందుపట్ల పెద్ద పల్లెటూరు. ఆ రోజు చంద్రయ్యకు బావగారి దగ్గరినుంచి జాబు వచ్చింది. శుభవార్త తెచ్చింది చంద్రయ్య బావ. పేరు సూరయ్య. చంద్రయ్యకు సూరయ్య స్వయాన బావ. సూరయ్య భార్య చంద్రయ్య పెద్దక్క. జాబు తెచ్చిన కబురు చంద్రయ్యను దీపావళి పండుగకు భార్యతోసహా రమ్మని.

చంద్రయ్య పదెకరాల రైతు. దానిలో రెండెకరాల మాగాణి, మిగతాది మెట్టభూమి. చంద్రయ్య కష్టపడి పనిచేస్తాడు. మాగాణిలో వరి పండిస్తాడు. మెట్టలో జొన్న, సజ్జ, వేరుశెనగ, కంది, పెసర, ఉలవలు, ఆముదాల వంటి పంటలు వేస్తాడు. అయితే మెట్టపంటలకు వర్షపు నీరే ఆధారం. పండేది, మునిగేది తెలీదు. పండితే అదృష్టం, పండకపోతే ఖర్మ అనుకుంటాడు. అయినా తిండికీ, గుడ్డకు లోటులేదు. పెళ్ళయి ఐదేళ్ళయినా పిల్లలులేదు.

దీపావళి పండుగరోజు దగ్గరికి రానే వచ్చింది. చంద్రయ్య అక్కా, బావల ఊరికి వెళ్ళాలి. ఆ ఊరు రేపాల. పండుగ రేపనగా భార్యతో సహా చంద్రయ్య సంతోషముతో రేపాల వెళ్ళాడు. సూరయ్య దంపతులు ఎంతగానో సంతోషించారు. చంద్రయ్య అక్క చాల సంబరపడిపోయింది. మర్నాడు పండుగ బాగా జరిగింది.

సూరయ్య పదిహేనెకరాల రైతు. పదెకరాల మెట్ట, ఐదెక రాల మాగాణి. పైగా సూరయ్య చదువుకున్నవాడు. మర్నాడు

సాయంత్రం బావగారితో పొలం వెళ్ళాడు. మెట్టచేలో కొంత వేరుశనగ, కొంత సజ్జ, మరికొంత కంది వేసి ఉన్నాయి. పంటచేను బాగుంది. చేలో చాలాచోట్ల అక్కడక్కడ గట్లువేసివున్నాయి. అవి ఏటవాలుగా ఉన్నాయి కూడా. చంద్రయ్యకు ఆశ్చర్యం వేసింది. చంద్రయ్య "అయితే బావా! మెట్టచేలో అక్కడక్కడ ఏటవాలుగా గట్లు ఎందుకు వేశారు ?"

సూరయ్య:-"గట్టు వేసింది నేలకోత నివారించటానికి. నీటివాలుకు అడ్డంగా గట్లు వేస్తాం. అవి ఏటవాలుగా కూడా వేస్తాం. వాలుకు అడ్డంగా గట్లువేసి వరదనీరు పోవటానికి కాలవ తవ్వితే, వాన నీరు వీలైనంతవరకు భూమిలోకి ఇంకి ఎక్కువైనది పంటలకు నష్టం లేకుండా వరదనీటి కాలవద్వారా బయటికి పోతుంది."

చంద్రయ్య:-"మరి గట్లు వేసినందువల్ల లాభమేమిటి ?"

సూరయ్య:-"మెట్ట భూముల్లో భూసారం పై పొరలలోనే, మనందున్నే లోతున్న మేరకు అరడుగు నుండి అడుగువరకు ఉంటుంది. పంట పండటానికి ఈ పై పొర ఉపయోగిస్తుంది. ఈ పొర వర్షాలవల్ల కొట్టుకొని పోతే మొక్కలు బాగా పెరగవు. దీన్నే నేలకోత అంటారు. ఎందుకంటే భూసారం పోయి, పైరు పాడై పోతుంది. తేమ నిలువ ఉండటం తగ్గిపోతుంది. పంట దిగుబడి కూడా తగ్గిపోతుంది."

చంద్రయ్య:-"మరయితే ఈ గట్లవల్ల నీరు నిలిచి మొక్కలు పాడై పోతాయి కదా !"

సూరయ్య:-"మొక్కలేమి పాడుకావు. ఈ అడ్డుగట్ల మూలంగా నీటివరద వేగం తగ్గి, పై పొర కొట్టుకుపోవడం జరగదు. ఎక్కువైన నీరు బయటకు పోవటానికి చిన్నచిన్న కాలువలుతీసి ఉన్నాయి.

వాటిద్వారా ఆ నీరు బయటికి పోతుంది. ఇక్కడ నీవు ఒక విషయాన్ని గుర్తించుకోవాలి. ఒక అంగుళం నేలపొర తయారు కావటానికి 150 నుండి 400 సంవత్సరాలు పడుతుంది. కాని వరదవల్ల, నేలకోత మూలంగా ఈ పొర కొట్టుకుపోవటానికి కొన్ని గంటల కాలంకూడా పట్టదు."

చంద్రయ్య:-"నెల రోజుల కిందట మా ఊళ్ళో పెద్దవర్షం పడింది. వేరుశెనగ, కందిచేలలో నీరు వరదలై పారి ఎంతో మన్ను కొట్టుకుపోయింది. మొక్కలు కూడా అంత బాగా లేవు. పంట దిగుబడి తగ్గిపోయేటట్లుందనిపిస్తోంది కూడా."

సూరయ్య:-"ఇలాంటి నేలకోతనుండి మన మెట్టభూములను కాపాడుకోటానికి గట్లు వెయ్యటం మొక్కటే మార్గం. రెండుగట్ల మధ్యదూరం 60 నుండి 120 గజాలదాకా ఉంటుంది. పై గట్టు నుంచి కింది గట్టువరకు వున్న భూమిలో నీరు సమానంగా ఇంకేటట్లు గట్లు వెయ్యాలి. ఇవి రెండు విధాలుగా చెయ్యొచ్చు. మొదటిది వాలుకు అడ్డంగా విత్తి తర్వాతచేసే పైపాటుతో చిన్న చిన్న గట్లు ఏర్పడేటట్లు చేయటం. రెండోది, బల్లపరుపు గట్లు, చిన్న కాలవలు వాలుకు అడ్డంగా తీసి సాగుచేయటం. ఈ రెండు పద్ధతుల్లో కూడా భూమిలో తేమ సమానంగా ఇంకి పంట దిగుబడి తప్పక హెచ్చుతుంది."

చంద్రయ్య:-"విత్తనం వేయగానే వర్షం పడితే ఏం చెయ్యాలి బావా?"

సూరయ్య:-"మన మెట్ట నేలలో విత్తనం వేయగావే గట్టి వర్షంపడితే నేల బండబారి మొలకెత్తే విత్తనం పైకి రానీయకుండా చేస్తుంది. అందువల్ల సరైన మొక్కల సాంద్రత లేకుండా పైరు పలచబడి వాసిరకంగా ఉంటుంది. ఇలాంటప్పుడు వర్షపుతడి ఆరగానే

దంతి (గుంటక) తోలి నేల బండబారకుండా చెయ్యాలి. లేక పోతే నేలనంతా చిన్న గట్లు, కాలువలుగా వాలుకడ్డంగా తీసి ఆ గట్ల పక్కన విత్తటం మంచిది. మరో పద్ధతి ఏమిటంటే విత్తిన చాళ్ళను చొప్పతో కప్పటం. అయితే ఈ పద్ధతి సాధ్యం కాకపోవచ్చు."

చంద్రయ్య:-"అన్ని పంటలూ దెబ్బతింటాయా? లేక కొన్ని తట్టు కుంటాయా బావా?"

సూరయ్య:-"నేలబండబారటం వల్ల చిన్నగింజ గల పంటలు ఎక్కువగా దెబ్బతింటాయి. అంటే రాగి, కొర్ర, సజ్జ బాగా దెబ్బ తింటాయి. జొన్నకూడ కొంతవరకు మొలకెత్తదు. ఆముదాలు, కందులు కొంతవరకు తట్టుకుంటాయి."

సూరయ్య:-"మరో సంగతికూడ ఉందిరా చంద్రా! పైరుకు కావలసినప్పు డల్లా వానలు పడవు. కాబట్టి చేలో నీరు ఎంత ఇంకితే అంత మంచిది. ఇందుకుగాను ప్రతిమూడేళ్ళ కొకసారి భూమిని బాగా లోతుగా దున్నాలి. అంటే అడుగునుండి అడుగున్నర లోతువరకు దున్నితే పైరు ఏపుగాపెరిగి మంచి పంటనిస్తాయి. కలుపుకూడా తగ్గిపోతుంది. ఇంకో సంగతేమిటంటే పైరు బాగా ఎదగాలంటే పశువుల పెంటను, గొర్రెల పెంటను ఎక్కువగా వేయాలి."

చంద్రయ్య:-"యూరియా, ఫాస్ఫేటువంటి రసాయనిక ఎరువులు మెట్ట పంటలకు వేయరుకదా బావా! కాని మీ పెద్దబ్బాయి మీరు వేస్తున్నట్లు చెప్పాడే!"

సూరయ్య:-"మెట్టపైరుల్లో హెచ్చు దిగుబడి విత్తనాలు జొన్న, సజ్జ, మొక్కజొన్న వంటివి. ముందు నీటిపారుదల కింద ప్రవేశ

పెట్టడంవల్ల ఈ దురభిప్రాయం ఏర్పడింది. మెట్టపైర్లకు కూడా అవసరాన్నిబట్టి తగినంత యూరియా, ఫాస్ఫేటు, పొటాష్‌లు వెయ్యాలి. హెచ్చుదిగుబడి విత్తనాలు మామూలు దేశవాళీ విత్తనాలకంటె, ఎరువులు వేసినా, వెయ్యకపోయినా హెచ్చుదిగుబడి నిస్తాయి. దేశం మొత్తంలో చాలా చోట్ల ఈ పంటలు మెట్టసాగులో వేసి వేర్వేరు భౌతిక పరిస్థితులలో దిగుబడి బాగాఉన్న రకాలనే విత్తనానికి దేశవ్యాప్తంగా ఇస్తారు. హెచ్చుదిగుబడి రకాలు వాటిలో సంకరజాతి విత్తనాలు ఎక్కువ పంటనిస్తాయని తేలింది. కాబట్టి హెచ్చు దిగుబడి విత్తనాలు, రసాయనిక ఎరువులు వేసినా, వేయకపోయినా మన మామూలు పెంటతోలినా ఎక్కువపంటనిస్తాయి. వాటికి మన మామూలు పంటల వలెనే తెగుళ్ళకు తట్టుకునే శక్తి కూడా ఉన్నది."

చంద్రయ్య:-"ఎన్నో సంగతులు చెప్పావు బావా! నేను కూడా మెట్టచేలో ఈ ఏడు గట్లు వేయాలి."

సూరయ్య:-"తప్పకుండా ! నీకు ఇంకా వివరాలు బ్లాకు వ్యవసాయ విస్తరణాధికారి చెబుతాడు."

---